




# సంపూర్ణ పోషకాహారంలో వుండవలసినవన్నీ కలిసివున్న రుచికరమైన పదార్థం

# సిరిలాక్®

## ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

ఇవ్వగలిగినంత కాలం మీ పాపకి చనుపాలు యివ్వండి—మీరు యివ్వగలిగిన మంచి ఆహారం అదే. 4 నెలల ప్రాయం వచ్చేసరికి పాపకి ఎక్కువగా పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికి పాప సిద్ధంగా వుంటుంది. సిరిలాక్ యివ్వడం వలన, పాలు యివ్వడం మానకుండా పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి.

మీ పాపకి సరిఅయిన పాళ్లలో పోషక పదార్థాలు అందించడానికి సిరిలాక్‌లో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు చక్కెర ఉన్నాయి. పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు శక్తి నివ్వడానికి, మాంసకృత్తులు పెరుగుదలకి, విటమిన్లు మరియు ఖనిజాల లోపాల నుండి రక్షణ కలిగించడానికి దీనిలో ఉన్నాయి. సిరిలాక్—మీ పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.

దీనిని తయారు చేయడం చాలా సులభం—దీనితో ముందుగా మరగబెట్టిన గోరువెచ్చని నీరు చేర్చండి


ముందుగా మరగబెట్టిన నీటితో సెరిలాక్ చేర్చండి


బాగా కలపండి


వెంటనే యిచ్చేందుకు తయారు

**సిరిలాక్**–పాలు వుండనే వున్నాయి

SAA/FSL/C/2258 TEL NESTLÉ

## ము ఖ చి త్ర ం

16.4.82 నాటి (మా) మా అభిమాన పత్రిక నటి రూప ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా చాలా బాగుంది. ముఖ చిత్రం హైలైట్.

జాడి పెంటయ్య, స్వర్ణలతా పెంటయ్య (ఇల్లెందు)

## సీ రి య ల్స్

16.4.82 తేది పత్రిక ముఖ చిత్రం నటి రూప నీట్‌గా క్లోజప్ చాలా బాగుంది. కొన్ని వారాలుగా మమ్మల్ని కలవర పెడుతున్న సీరియల్ మనసుకథ ఈ వారంతో మా మనస్సుకు కాస్త శాంతిని కలిగించింది.

ఎస్. అవ్‌సర్‌హుస్సేన్ (గిరింపేట)

* * *

16.4.82 ముఖచిత్రం నటి రూప తెలుగుతనానికి మారుపేరులా ఉంది. ఇకపోతే వాసిరెడ్డి సీతాదేవిగారి మనసు కథలో సుజాతే ఉన్మాద స్థితిలో ఉన్నట్లు తోచుచున్నది. ఎంతయినా రచయిత్రిగారి చాతుర్యం ప్రశంసనీయం.

ఎం. శారద (పాలకొండ)

* * *

16.4.82 ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని కథలు చాలా బాగున్నవి. సీరియల్స్‌లో ముఖ్యంగా 'తార' సీరియల్ చాలా బాగుంది. 'తార' సీరియల్ కథ ఒక నూతన పద్ధతిలో నడుస్తూంది.

జె. శ్రీనివాస్ (ముదివాణిక్యం)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 16.4.82 తేది నాటి నటి రూప ముఖచిత్రం బాగుంది. మనసు కథ, ''తార'' సీరియల్స్ చదువుతున్నకొలదీ సస్పెన్స్ కలుగజేస్తున్నాయి.

జోస్యుల రామలింగేశ్వరరావు మరియు వారి కుటుంబ సభ్యులు (పేసలి)




16.4.82వ తేదీన వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి ''రూప'' చూచుటకు ముగ్ధ మనోహరంగా ఉన్నది. ''తార'' మరియు మనసుకథ సీరియల్స్ మంచి సస్పెన్స్ గానున్నవి. ''తార'' సీరియల్‌లో తార పాత్ర, మనసుకథ సీరియల్‌లో సుజాత పాత్ర మాకు ఎంతగానో నచ్చాయి.

ఆర్. వీరభద్రరావు, వి. నాగేశ్వరరావు [ఖర్గపూర్]

## క థ లు

16.4 82ఆంధ్రసచిత్రవారపత్రికముఖచిత్రం రూపచాలాఆకర్షణీయముగాఉన్నది. తనవరకూవస్తే కథ చాలాబాగుంది. కృష్ణ గారికి అభినందనములు.

రావువారి వెంకటేశ్వర్లు (పర్చూరు)

* * *

16.4.82 ముఖచిత్రం నటి రూప చాలా బావుంది. ఈ వారం మీరు ప్రచురించిన కథలన్నీ చదివాను. ఈ కథలన్నింటిలోకి 'అర్హత' కథ నాకు బాగా నచ్చింది.

తోట శోభన్‌బాబు (ఖర్గపూర్)

* * *

నటి రూప ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర పత్రిక నిత్య నూతనంగా కడిగిన ముత్యమల్లె మెరిసిపోతూ కనిపించింది. ఈ వారం అందించిన కథల్లో అర్హత కథ చదివాను. చిన్నదైనా నన్ను విశేషంగా ఆకర్షించింది.

కందిగట్ల ప్రభాకర్ (జనగామ)

16 4 82 నాటి ముఖచిత్రం నటి రూప చాలా బాగుంది. ''తనవరకు వస్తే'' కథ బాగుంది. ఈనాటి యువతరానికి కనువిప్పుగా ఉంది

మల్లెం వెంకటేశ్వరరావు (ఖమ్మం)

* * *

16 4 82 నటి రూప ముఖచిత్రంతో వెలువడిన పత్రిక అపురూపంగా ఉంది. కవనశర్మ ''స్త్రీలు పిల్లలు ముందు'' కథ నాకు చాలా బాగా నచ్చింది.

పి. వి. రావ్ (సారంగపూర్)

* * *

ఈవారం రూపముఖచిత్రంతో వెలువడిన పత్రికలో తనవరకూ వస్తే కథలో బస్సుల్లో ఆడపిల్లలు ఎటువంటి అవస్థలకు గురి అవుతున్నారో చక్కగా వివరించారు. ఇది చదివిన తరువాతఅయినా కొందరు తమ ప్రవర్తనను మార్చుకొంటారని ఆశిస్తాను.

ఎస్. ఇందుముఖి (హైదరాబాద్)

* * *

16 4.82 పత్రిక ముఖచిత్రం నటి రూప చూడ ముచ్చటగా ఉన్నది. కథలు చాల బాగున్నవి. ఎక్కువ కథలు వేసినందుకు మా అభినందనలు. అందులో 'తల్లి నేల' చాలా బాగున్నది.

కె. చెన్నారెడ్డి (గుంటకల్)

## ఊ మె న్ కా ర్టూ న్

16.4.82 సంచికలో వెలువడ్డ ఉపోగారి లోకంపోకడ కార్టూన్స్‌లో టోకు—చిల్లర ధరలు మీద కార్టూన్ నన్ను అమితంగా ఆకట్టుకొంది. ఉన్న నిజమే అది. మరో విచిత్రం ఏమంటే మీ కార్టూన్ వచ్చాకే కేంద్ర ప్రభుత్వం ''ప్రైస్ ఇన్‌డెక్స్ వర్కింగ్ గ్రూప్'' అంటూ నియామకం చేసినట్లు యిటీవలే వో వార్త చదివాను. గణన లోనికి తీసుకోవలసిన అంశం టోకు ధరలు కాదు, చిల్లర ధరలే !

కె. సుబ్రహ్మణ్యం (బెంగుళూరు)

## కా ర్టూ న్లు

16.4 82 సంచికలో 30, 47, 57 పేజీల లోని కార్టూన్స్ చాలా బావున్నాయి. ముఖ్యంగా 24వ పేజీలోని ప్రసాద్ కాజ గారి కార్టూను చాలా అందంగా ఉంది. కార్టూనులో జోకు అంతగా బాగా లేకున్నా ఆ కార్టూను నీటుగా అందంగా ఉండి మరీ మరీ చూడాలనిపించే విధంగా ఉంది.

విజయశ్రీ (ఆదోని)

## క వి త లు

అందాల అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఈ మధ్య మీరు ప్రచురిస్తున్న కవితలు సందేశాత్మకంగా ఉంటున్నాయి. సమాజానికి కనువిప్పు కలిగించే కవితా రచనలు ప్రచురిస్తున్నందులకు సంపాదక వర్గానికి మా అభినందనలు.

ఎల్. ప్రఫుల్లచంద్ర, కుమారి నిర్మల (ధర్మవరం)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 1972]

శుక్రవారం : 14-5-'82

దుందుభినామ సం. వైశాఖ బ. షష్ఠి

సంపుటము 75 : సంచిక 36

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 67-60

ఆరు మాసాల చందా రు. 33-80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





సీరియల్

# హృదయరాణి

"విశాఖి" ప్రారంభం

**పెళ్ళి యిల్లంతా దీపాల తోరణాలతో 'నక్షత్రాలు భూమి మీదికి వచ్చాయా' అన్నట్లుంది.**

**పందిరిలో రకరకాల పట్టు చీరలు, సెంటు వాసనలు, బెనారెస్ జార్జెట్ చీరలు, పువ్వులు, ధోవతులు, కండువాలు, బెల్ బాటమ్స్!**

**సోఫాలమీద కూర్చున్న పెళ్ళికొడుకు రంగనాథ్, పెళ్ళి కూతురు మాలిని ఓర చూపులతో చూసుకుంటున్నారు.**

పెళ్ళికి వచ్చిన అందరిదీ ఒక్కటే మాట, డాక్టరు మాలిని చాలా అదృష్టవంతురాలని. ఆరడుగుల ఎత్తు, ఎత్తుకి తగ్గ లావు, నల్లటి జుత్తు, ఎట్టటి మనిషి. ఎమ్మే లిటరేచరు, కలకత్తాలో పెద్ద ఆఫీసరు గారి ఒకే ఒక కొడుకు.

రంగనాథ్‌కి ఒక్కతే చెల్లెలు లావణ్య. ఆ వారి ఫ్యాషనుగా జుత్తు విరబోసుకుని బెంగాలీ చీర కట్టుకుంది. పెళ్ళి జరిగాక రిసెప్షన్ లాంటిది లేనందువలన పెళ్ళి కూతురి తండ్రి శ్రీనివాసరావుగారి కోరికపై వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళి వచ్చారు వాళ్ళు. రాత్రి వ్రాళ్ళొని సగుణం కోసరం డిన్నరు, దానికి వచ్చిన వాళ్ళతో పెళ్ళి పందిరి కళకళలాడుతోంది.

వచ్చిన వాళ్ళందర్నీ పలకరించి, దగ్గరుండి భోజనాలప్పుడు అన్నీ కనుక్కుని అందరికీ మర్యాదలు చేసారు శ్రీనివాసరావుగారు. అందరూ భోజనాలయి వెళ్ళాక మాలిని మేనత్త మాలినిని తీసుకుని వెళ్ళి రిసెప్షన్ చీర మార్చుకోమని తెల్ల జార్జెట్ చీర ఎంబ్రాయిడరీ చేసింది యిచ్చింది. "మాలినీ, నీకు అమ్మలేదు ఉంటే అన్నీ చెప్పించేది. డాక్టరు వయిన నీకు నేను చెప్పేదేమీలేదు. నీకు తెలియనివి నాకు తెలుస్తాయి కనుకనా! ఏదో పాతకాలం మనిషిని. కనుక రెండు ముక్కలు చెప్తున్నాను. ప్రొద్దున్న ముహూర్తంవేళ 'సప్తపది' జరిగింది చూసేవా. ఆ ఏడడుగులు వేసేవా? ఏడడుగులు కలిసి వేస్తే వారు మిత్రులవుతారంటారు. ఇంకమీద కష్టం సుఖం అన్నీ రంగనాథానితో పంచుకో తల్లీ. మన ప్రాణాలున్నంతకాలం భర్తతో వేసిన ఏడడుగులు జ్ఞాపకం పెట్టుకొని ఆ భర్తకి నీడలాగా ఉండాలి రంగనాథానికి కష్టం రాకుండా అతని ఇష్టానుసారం నడుచుకో మీ అత్తగార్కి ఒక్కడే కొడుకు, తల్లినీ కొడుకునీ వేరు చెయ్యకమ్మా! ఇదే నే చెప్పేది. నువ్వు అల్లరి పెట్టితే పాపం! నీ కోసరం అతను వాళ్ళ వాళ్ళని విరోధించుకుంటాడు. అది తప్పు తల్లీ. ఇంక నీ గదికి వెళ్ళమ్మా. నీ కుండుట బీరువా తాళం బీరువా తలుపుకే వుంది. రాగా పోగా కొంత అలంకారం చేస్తేం. జాగ్రత్త తల్లీ. నే వుంటాను' అంటూన్న మేనత్తకి నమస్కారం చేసింది మాలిని.

మెడిసన్ చదువుతూన్నందున తీరికలేక తండ్రిని చూసుకోవడానికి రమ్మంటే మేనత్త వెంటనే వచ్చింది. అందరూ స్వార్థం కోసమున్నారు. కానీ డాక్టరీ ముగించగానే మళ్ళీ వాళ్ళ వూరెళ్ళిపోయింది. తనకీ కలకత్తా సంబంధం చూస్తున్నారని తెలిసినా తన కొడుక్కివ్వలేదన్న కోపమే లేని ఉత్తమురాలావిడ.

మెల్లిగా తన గది కేసి వెళ్ళింది. లోపలికి వెళ్ళడానికేదో సిగ్గు, సంకోచం. కాలు ముందరకి పడలేదు. భయం భయంగా తలుపు దగ్గరగా వచ్చింది. ఒక రెక్క మూసి ఉంది. తెరచి వున్న రెక్క ద్వారా లోపలికి చూసింది. డన్‌లప్ పరుపు మీద తెల్ల ధోవతి పిల్కులాల్చీతో అతిసుందరమూర్తి తలగడాల పై మోచేయి నుంచి దీర్ఘాలోచనలో మునిగి వున్నాడు. వెనకనే వున్న మేనత్త 'లోపలికి వెళ్ళి తలుపు వేసుకో అమ్మా! వంటవాళ్ళ సంగతి అదీ నే వెళ్ళి చూసుకుంటాను' అంది. ఆడపడుచు గానీ అత్తగారు గాని ఆ చుట్టుపక్కల ఉన్నారేమోనని చూసింది. కానీ లేరు. శ్రీనివాసరావు గారు 'కార్యం అన్నది అతి పర్సనల్ విషయం. నలుగురూ వచ్చి కూర్చుని నానా హంగామా చెయ్యకూడద'ని తన మామ గారితో అనడం గుర్తుకు వచ్చి తండ్రికి మనసులోనే థ్యాంక్సు

చెప్పకుంది. లోపలికి వెళ్ళి తలుపు మూసి శబ్దం చెయ్యకుండా గడియ వేసింది. మెల్లగా మంచం దగ్గరగా వచ్చి నిల్చుంది. రంగనాథ్ "రా కూర్చో మాలినీ" అంటూ మాలిని చేతుల్ని తన చేతిలోకి తీసుకున్నాడు. ఒళ్ళంతా ఏదో విద్యుత్తు లా పాకిన మాలిని మైమరచి పరవశించి కళ్ళు మూసుకుంది. ఒక్క క్షణంలో ఆందోళనతో కళ్ళు తెరచి భర్త కేసి చూసింది. తన చేతుల్ని పట్టుకున్న చెయ్యి పట్టు మరీ గట్టిగా అయింది. చూస్తుండగానే గ్రుడ్లు పెద్దవి చేసి మంచంమీద నుంచి క్రింద తివాచీ మీదకి ఒరిగిపోయాడు. చెయ్యి కొట్టుకుంటూ తల కాయని ఆడిస్తున్నాడు. మాలినిలోని స్త్రీ తప్పకుని డాక్టరకి చోటిచ్చింది. ఫిట్సు వచ్చాయని అర్థం చేసుకుని మెల్లగా తల క్రింద తలగడాలు పెట్టి, చేతిలోకి తన వెండి తాళం చెవుల గుత్తిలోని ఇనుప తాళం చెవియిచ్చి, పళ్ళకి మధ్యన అడ్డంగా చిన్న కర్రముక్క పెట్టింది. గబగబా వెళ్ళి మందుల బీరువా తీసింది గార్డినాల్ ఇంజెక్షన్ తీసింది. ఫినో బార్బిటోన్ టాబ్లెట్సు తీసింది. ముందర నిదానంగా ఇంజెక్షనిచ్చింది, వాళ్ళ పని పిల్లకి ఫిట్సు వచ్చినందువలన ఆ పిల్ల కోసరమని



## ఏడడుగులు

ఫిట్సుకి కావాల్సిన మందులన్నీ కొని బీరువాలో వుంచింది. ఆ పిల్ల ఆరోగ్యం బాలేదు అని పని మానేసింది. ఆ కొన్న మందులు బీరువాలో వున్నాయి. అవి తీసి వాడింది. ఫిట్సు వుధృతం తగ్గాక రంగనాథ్‌కి మెల్లగా మైకంలా నిద్ర ముంచుకు వచ్చింది. నిద్ర పోతూన్నట్టు మగతగా పడుకున్న భర్తని చూసేసరికి మాలినికి దుఃఖం పొంగుకుని వచ్చింది. 'హే భగవాన్! ఏ చర్యలకి అర్థం ఏమిటి? జ్ఞానంరాకుండానే అమ్మని తీసుకుని పోయావు. ఇప్పుడు భర్తనిచ్చి, కాపురం లేకుండా చేస్తావా? నేనేం చెయ్యను? అసలే బాధపడుతున్న నాన్నగారికీ విషయం తెలిస్తే అతని బెంగని ఎలా పోగొట్టగలను? అతనీ దెబ్బని తట్టుకుంటారా? వెదికి వెదికి మూడు తరాలని గురించీ అడిగి అల్లాయిష్ణ కాని వాడిగా తేవాలని పెళ్ళిళ్ళ బ్రోకర్ల వద్దని ఎవరో మధ్యవర్తి ద్వారా కుదిర్చారు. ఇలా ఫిట్సు వచ్చిందంటే నాన్నగారు తట్టుకోలేరు. అందువల్ల ఈ విషయం ఎవరికీ తెలవకుండానే కలకత్తాకి వెళ్ళిపోవాలి' అని నిర్ణయం చేసుకుంది. కలకత్తాలో తన క్లాసుమేటు వనజ ప్రయివేటు ప్రాక్టీసు పెట్టింది. దాని ద్వారా ఎవరైనా న్యూరో సర్జనుని చూడాలి అని డాక్టరు మాలిని నిర్ణయించుకుంది.

కానీ ప్రతికన్యా కలలుకనే ఆ మొదటిరాత్రి తను స్త్రీగా భర్త సన్నిధిలో పూర్ణ ఆనందాన్ని చవిచూడాలన్న కోరికతో వచ్చిన మాలిని, స్త్రీగా కాక డాక్టరుగా, రంగనాథ్‌ని భర్తగా కాక పేషెంటుగా చూడాల్సి వచ్చింది. ఇది తట్టుకోలేక ఆ బేల ఏడ్వటం ప్రారంభించింది. అంతలోనే ఎన్నో సందేహాలు. ఇదే మొదటిసారా? ఇంతకుముందే ఇలా వుందా? ఇంతకు ముందే వుంటే వాళ్ళెందుకు దాచారు? ఇది ఎలాంటి ఫిట్సు? భగవంతుడా ఇది ఎపిలప్సీ కాదు కదా! అయ్యో నేనేం చెయ్యాలి? అంటూ ఆ స్త్రీ హృదయం తపించిపోయింది. ఈ రాత్రి ఈ అలంకరణలెందుకు? ఎప్పుడూ చేసే నైట్ డ్యూటీ! ఈ రోజూ నైట్ డ్యూటీయేనా? ఎప్పుడు తెలవారుతుందా అని ఎదురు చూస్తూ మంచం ప్రక్కన నేలమీద పడుకున్న భర్తనే చూస్తూ కుర్చీకి చారగిలబడి కూర్చుని

ఎప్పు రాని దుఃఖం గొంతుకి పైకి రానీయకుండా రోదించింది- మొదటి రాత్రి నాడు పెళ్ళికూతురు మాలిని ఇవేమీ తెలియని శ్రీనివాసరావుగారు పిల్ల పెళ్ళయిందన్న ఆనందంతో సుఖంగా నిద్రపోయారు. మందులతోటీ, ఫిట్సు వచ్చిన అలసటతో మగతగా పడి ఉన్నాడు పెళ్ళికొడుకు రంగనాధ్

## 2

సూర్యుని కిరణాలు కిటికీలోంచి నేరుగా మాలినిని తాకేసరికి తెలివొచ్చి, లేచి వెళ్ళి కి. కి తెరలని బాగా మూసి వచ్చింది సగం సగం తెలివి వస్తున్న భర్తని మెల్లగా తట్టి లేపి మంచంమీద పడుకోమని చెప్పి, రాత్రి తమకోసమని పెట్టిన పాలు పాడవకుండా వున్నాయా యని ఫ్లాస్కులోని గ్లాసులో పోసి చూసి, బాగానే వున్నాయని గ్రహించి కాస్త పాలు భర్త చేత తాగించి రెస్టుగా పడుక్కోమని చెప్పి అటాచ్డ్ బాత్ రూములోనికి వెళ్ళింది రాత్రి ఏడ్చిన విషయం ఎవరికీ తెలియకుండా ఉండడానికని షవర్ క్రింద షాంపూతో తలంటుకుంది స్నానం ముగించుకుని ఇస్త్రీ చేసిన జరీవున్న వెంకటగిరి చీర అదే రంగుది రవికా ఎన్నుకుని డ్రస్సయ్యాక క్రిందికి దిగింది క్రింద హాల్లోనే పిన్ని కూతురు శ్యామల, బాబాయి కూతురు రాధా కూర్చుని కాఫీ త్రాగుతున్నారు వాళ్ళ ప్రక్కనే సోఫాలో కూర్చుంది అత్తగారూ, మావగారు కనపడితే కేసు హిస్టరీ అడగాలనుకుంది కాఫీ తీసుకొచ్చిన మేనత్త "నువ్వింకా నిద్రపోతున్నావనుకుని వాళ్ళు నిన్ను లేపడం ఇష్టపడక ప్రొద్దుటే వాళ్ళ కార్లో సింహాచలంకి వెళ్ళేరమ్మా! అక్కడ్నుంచి ఇక్కడకి వచ్చి వెంటనే కోనసీమకి వెళ్తారుట మీఆడపడుచు లావణ్యకి సంబంధాలు చూట్టానికి తెలుగూర్లలో తిరుగుతామన్నారు మీకెప్పుడిష్టమయితే అప్పుడు కలకత్తాకి వెళ్ళిపోవచ్చు నన్నారమ్మా! అదృష్టవంతురాలివి తల్లీ అత్తగారూ మావగారూ కూడా అన్నీ నీ యిష్టానికే వదిలేసారు" అంటూ కాఫీని మాలిని కిచ్చింది కాఫీ తీసుకుంటూ 'అదృష్టంలాగే వుంది హిస్టీరియా పేషంటు భర్తతో' అనుకుంటూ కాఫీ కప్పుని త్రాగడానికని పెదిమల దగ్గర పెట్టుకుంది

"ఏమే శ్యామలా! మాలినికి రాత్రంతా నిదలేదులా వుందే కళ్ళు చూడు ఎర్రగా జ్యోతుల్లా ఎలా వున్నాయోచు" అంది రాధ

కిసుక్కున నవ్వుతూ "నిద్రెలావుంటుందే అమ్మాత్రం తెలియదూ? ఇన్ని తెలుగుసినిమాలు చూస్తున్నావు కదా!" అంటున్న శ్యామలని చూస్తూ మాలిని లోలోనే మధనపడసాగింది తను రాత్రంతా డాక్టరుగా పేషంటుని చూసుకుందేగాని, భార్యగా భర్తని చూడలేదని వీళ్ళకెలా చెప్పటం? చెప్పినా మాత్రం వీళ్ళ కర్ధమవుతుందా? అది వింటే తండ్రికీ బాధ అందుకే నవ్వుతూ—

"షాంపూ కళ్ళలో పడిందరా" అంది

"కాయ్ కాయ్ షాంపూ పడిందిట అయితే బావగారింకా లేవలేదేం?" అంటూ కొంటెగా చూసింది రాధ

'హు బావగారు రాత్రి ఫిట్సుకి అలసి పడుకున్నారు' అనుకుంటూ—

"పెళ్ళి అది టయర్డ్ అయ్యారో లేక అసలు ఎప్పుడూ లేటుగా లేచే అలవాటోను మరి నాకేం తెలుస్తుంది"

"ఆ ఆఁ! టయర్డ్ అన్నావు బాగుంది" అంటూ మెట్లకేసి చూసిన రాధ "అదుగో బావగారు లేచారు అత్తయ్యా కాఫీ కలుపు" అని కేకేసింది శ్యామల గబగబా మాలిని వెళ్ళింది మెట్లు దిగుతున్న రంగనాధ్ గిల్టీగా ఫీలవుతూ మాలిని కేసి చూసాడు మాలిని గతరాత్రి విషయం మర్చిపోయి, మిగతా విషయాలే మాట్లాడాలని నిర్ణయించుకుంది ఎపిలెప్సీ వే అయితే ఆ మనిషికి ఏ విధమైన బెంగలుగానీ, ఆందోళనలుగానీ, ఆవేశాలుగానీ రానీయకుండా జాగ్రత్త పడాలి

"ఉండి కాఫీ తెస్తాను" అని వంటింట్లోకి వెళ్ళి అత్తయ్య యిచ్చిన కాఫీ తీసుకుని వచ్చి భర్త కిచ్చింది

పైకి వెళ్ళిన శ్యామల గబగబా దిగుతూ "ఏవమ్మా మాలినీ ఊసులాడుకోవడాలలో ఏమీ తినేందుకుగానీ త్రాగేందుకుగానీ ఖాళీ లేకపోయిందేమిటి, అన్నీ అలాగే వున్నాయి? నాకు తెలియక అడుగుతున్నానుగానీ బావగారికి డాక్టరువి కదా అని మెడలో స్టెతస్కోపుని పూలమాలకి బదులుగా వేసేవేమిటి? స్టెతస్కోపు మంచంమీదుంది" అంటూ గబగబా వేళాకోళం చేయడం ప్రారంభించింది రంగనాధ్ ముఖంలోని మార్పులని గమనించిన మాలిని ఆదుర్దాతో మాట మార్చాలని "ఏ వేళాకోళంకేంగానీ బావగార్కి ప్రొద్దుట టిఫిన్ తినడం అలవాటో, పెందరాళే భోజనం చెయ్యడం అలవాటో కనుక్కో నేనొక్కసారి హాస్పిటల్ దాకా వెళ్ళి వస్తాను" అంది

"ఇదేం చోద్యమే తల్లీ పెళ్ళయిన మర్నాడు ఎవరేనా డ్యూటీకెళ్తారా?"

"డ్యూటీకాదే మొన్న ఆపరేషన్ జరిగిందే ఆ పిల్ల ఎలా గుందో ఒక్కసారి చూసి వస్తాను నిన్న కూడా వెళలేదు కదా! స్టెతస్కోపూ అది తీసుకెళ్తే వెంటనే వచ్చేస్తాను మా తల్లివి కదూ బావగారితో కబుర్లు చెప్తూ ఒంటరిగా వదిలెయ్యకు



# ఏడడుగులు

నాన్నగారు ప్రొద్దుటి వాక్ నుంచి వస్తే నేనిదిగో వచ్చేస్తానని చెప్పు ఏవండీ అర్ధ గంటలో వస్తాను పరేనా'' అని భర్తని అడుగుతూ, మళ్ళీ జాగ్రత్త కోసం ''నేవచ్చేంత వరకూ బావగారిని ఒంటరిగా వదలకేం'' అని రాధని హెచ్చరించింది రాధ వేళాకోళంగా ''ఇంత అందగాడిని నాకిచ్చి వెళ్ళిపోయావంటే మళ్ళీ నీకు దక్కడు తెలుసా'' అంది మాలిని మౌనంగా బయల్దేరి హాస్పిటల్ కి వెళ్ళి వేరుగా శివరావుడిపార్టుమెంటుకెళ్ళింది అక్కడ తన స్నేహితుడు శివరావుని కల్సుకుంది.

''శివరావ్! నిన్ను కన్సల్ట్ చెయ్యడం కోసం వచ్చాను'' అంది ఉపోద్ఘాతంగా

''హల్లో! క్రొత్త పెళ్ళికూతురువి ప్రొద్దుటే హాయిగా ఏక్కడో సినిమాకో బీచ్ కో తిరగక ఇక్కడకొచ్చావేంటి'' అని జోక్ చేస్తున్న శివరావుని మధ్యలో ఆపి-

''రావ్ జోకులకిది సమయం కాదు నేను చాలా సందిగ్ధంలో పడ్డాను ఓపికతో విను'' అంటూ రాత్రి జరిగింది చెప్పింది విన్న శివరావు-

''ఐ యామ్ సో సారి ఇటీజ్ రియల్లీ ఏ పిటీ వాళ్ళని గురించి అన్నీ తెలుసుకున్నావా?''

''దానికి అవకాశమే రాలేదు ప్రొద్దున్న నే వచ్చేసరికే అతగారూ, మావగారూ, లావణ్య వెళ్ళిపోయారు సో నేను అడగదల్చుకుంటే ఆయన్నే అడగాలి దానికిది సమయం కాదు నాన్నగారి సంగతి తెలుసు కదా! అసలే బెంగులు అన్నీ వివరంగా కనుక్కోకుండానే తన పెళ్ళి జరిగిందిట అమ్మా వాళ్ళ వంశంలో అందరూ అల్పాయుష్కులేట అత్తయ్యకి పెళ్ళి అయిన తర్వాత కడుపుతో వుండగానే మామయ్య పోయారు పెళ్ళికి ముందరే కాన్సరని వాళ్ళ వాళ్ళకి తెలిసీ వాళ్ళు చెప్పలేదు అందుకే ఈసారి నాన్నగారు చాలా చాలా విచారణల తర్వాతే చేసారు నాదీ తనలాగ, అత్తయ్యలాగా కాకూడదు. లవ్ మారేజీ వద్దని తను లాగే నాదీ అవుతుం దేమోనని మధ్యవర్తుల్ని కనుక్కొని మరీ నిశ్చయం చేసారు 'వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చేయమన్న' సామెతని నిజం చేసేరు లాగుంది మవ్వొక్కసారివచ్చిచూడు.

## త్రీ-డి టెలివిజన్లు!

పశ్చిమ జర్మనీ త్రీ డి టెలివిజన్ కార్యక్రమాలను రంగుల్లో ప్రసారం చేస్తున్నారు మామూలుగా చూస్తే బొమ్మల్లో పొడవు, ఎతులు మాత్రం కన్పిస్తాయి త్రీడి బొమ్మలో వెడల్పు లేక లోతు కూడా కన్పిస్తుంది ఈ ప్రసారాలను రంగుటద్దాల ద్వారా చూడ వల్సి వుంటుంది. ఈ కార్యక్రమాలు ప్రజలకు అమితంగా ఆకర్షించడంతో, ఈ రంగుటద్దాలకు కూడా విపరీతమైన గిరాకీ ఏర్పడింది ఇందులో రెండు రకా ప్రతిబింబాలను ఒకేసారి ప్రసారం చేస్తారు - వీటిని రంగుటద్దాల ద్వారా చూసినపుడు ప్రఖ్యాత నటులు మీ ప్రక్కన కూర్చుని కబుర్లు చెబుతున్నట్లు, అందమైన స్త్రీలు మోచేతి దూరంలో మీ గదిలో సంచరిస్తున్నట వినిపిస్తుంది!

నీకు త్వరగా అర్థం అవుతుంది అది విపిలెప్సీనే అయితే నేను వెంటనే వారితో కలకత్తాకి వెళ్ళిపోతాను నాన్నకి విషయాలు తెలవనివ్వకుండా జాగ్రత్తపడాలి ఓకే''అంది శివరావు మెల్లగా 'ఫేసియల్ ఎక్స్ప్రెషన్ అని ఒట్టి జనరల్ గా చెప్పవచ్చును గనీ బాగా ధరోగా మెడికల్ చెక్ చేయించి మరి నిర్ణయం చెయ్యాలి ఎలీవే ప్రస్తుతానికి మందులని చెప్తాను, కలకత్తాలో వనజ వుంది కదా! వనజతోటి కలిసి డాక్టర్ ముఖర్జీని చూసి అతని ఒపీనియన్ కూడా తెలుసుకోవన్నడిగితే మైండాసుకి తీసుకెళ్ళడం మంచిది గానీ అది చేస్తే విషయం బయటకి వస్తుంది రా, మనం వెళ్దాం'' అంటూ డ్యూటీ నర్సుని పిల్చి హౌస్ సర్జన్ తో తను బయటకి వెళ్తున్నానని చెప్పమని మాలినితో వాళింటికి వచ్చేడు

శివరావుని భర్తకి చూపుతూ ''ఇతను డాక్టరు శివరావు, మా డిపార్టు మెంటే'' అని అబద్ధం చెప్పి, శివరావు కేసి చూసి ''డాక్టర్, నిన్న పెళ్ళిలో చూసే వుంటావు, నీకు వేరే ఏమీ చెప్పక్కరలేదు'' అంటూ పరిచయం చేసింది

శివరావు మామూలుగా మాట్లాడుతూ రంగనాథ్‌ని నిశితంగా పరిశీలించాడు రంగనాథ్ చూపు బొత్తిగా తన పైననే అదేపనిగ నిల్చి వుండటం, పెదిమల కొసల్ని కదుపుతూ వుండటం అవీ గమనించి ఒక న్యూరాలజిస్ట్‌గా పరిశీలించిన శివరావుకి మాలిని డయాగ్నోసిస్ కరక్టేనని తెల్సింది. కాస్త అవీ ఇవీ మాట్లాడక వస్తానంటూ లేచాడు మాలిని కూడా బయటకి వచ్చింది. "నీ డయాగ్నోసిస్ కరక్టేననిపిస్తోంది మే గాడ్ హెల్ప్ యూ కలకత్తాలో వనజని త్వరగా కలుసుకో" అంటూన్న శివరావు మాటలతో మాలిని గుండెల్లో రాయి పడింది. శివరావు అదికాదు అనకూడదా దేముడా! అని పిచ్చిగా ప్రార్థిస్తూన్న మాలినికి అది అదేనేమో వనసరికి ప్రపంచమే అంతం అయిపోయినట్టుంది. జీవితమే నాశనమయి పోయిందనుకుంటూంటే మేనత్త చెప్పిన ఏడడుగుల బంధం మాటలు గుర్తుకు వచ్చి తననితనే సంబాళించుకుని, శివరావ్‌కి థాంక్స్ చెప్పి లోపలికి వెళ్ళింది "అత్తయ్యా, మేం ఇద్దరం ఇవాళే కలకత్తాకి వెళ్ళిపోతున్నాం. నువ్వు ఇవ్వదల్చుకున్న స్వీటులూ, అటుకులూ, ఊరగాయలూ అన్నీ త్వరగా కట్టెయ్యి" అంటూన్న మాలిని కేసి కృతజ్ఞతతో చూసేడు రంగనాథ్

రంగనాథ్‌కి తనకి ఫిట్సు వచ్చాయన్న విషయం తెల్సు ఎప్పుడో చిన్నతనంలో వచ్చినది మళ్ళీ వస్తుందనుకోలేదు. ఈ విషయం బయటకి తెలిస్తే ఎలా అని మథన పడుతున్న తనకి మాలిని ఒక దోవ చూపించిందని సంతోషపడుతూ మాలిని కేసి కృతజ్ఞతతో చూసేడు.

వంటింట్లోంచి బయటకి వచ్చిన మేనత్త "ఇదేం చోద్యమే తల్లీ" అంది

రాధ, శ్యామలా నవ్వుకుంటూ చెప్పారు—

"నీకు తెలవదులే అత్తా దీన్నే హనీమూన్ అంటారు కలకత్తాలో పెద్ద యిల్లు, ఇంట్లోనా వేరే ఎవరూ లేరు. ఇంకో ఊరు ఎందుకు? ఖర్చు తక్కువ ఫలం ఎక్కువా అని బావగారితో కలకత్తాకి చెక్కేస్తోంది కరక్టేనా మాలినీ" అంటూన్న వాళ్ళకేం జవాబు చెప్పాలో తెలవక, నవ్వి వూరుకుంది. బయటనుంచి వచ్చిన తండ్రితో రాధవాళ్ళూ చెప్పినదే చెప్పుదామని నిర్ణయించుకుంది.

(ఇంకా వుంది)



## బలాత్కారం—హత్య !

హనుమకొండకు చెందిన నాగభూషణం చంద్రకళ అనే అమ్మాయిని పెంచుకుని, పెద్దదాన్ని చేసి, వో ఇంటిదాన్నిచేసి సాగనంపాడట పెళ్లయ్యాక పండుగకు ఆమె పెంపుడు తండ్రి ఇంటికి వచ్చిందట 8 వ తేదీ పట్టపగలు నాగభూషణం కొడుకు 23 ఏళ్ళ రామప్రసాద్ ఆమెను ఇంట్లో బలాత్కరించి, కుదరక పొడిచేశాడట కత్తితో ఆమె అరుపుకు చుట్టుప్రక్కలవారుచేరి, తలుపుగలేస్తే ఆతను రయ్యిన పారిపోయాడట చంద్రకళ చనిపోయిందట

## తాగుబోతుల అగడం !

చీరాలలో 19 ఏళ్ళ మస్తానమ్మ అనే అమ్మాయి ఏప్రిల్ పదవ తేదీన సుబ్రహ్మణ్యేశ్వరస్వామి ఆలయంలో పాలునైవేద్యంపెట్టి, ఇంటికి తిరిగి వెళ్తూండగా వో తాగుబోతు ఆమెను అడ్డగించి, స్నేహితులైన మరి కొందరు తాగుబోతులతోచేరి ఆమెను బలాత్కరింపబోయే సరికామె ప్రతిఘటిస్తే, కోపంతో ఆమెను రాయితో కొట్టవారు పారిపోయారట నెత్తి చిల్లుపడిన ఆమె ఆసుపత్రిపాలయిందట

## అగ్ని ప్రమాదంలో 70 లక్షలు నష్టం !

తమిళనాడుకు చెందిన నామక్కల్ అనే వూరిలో మొన్న ఏప్రియల్ పదవతేదీ మధ్యాహ్నం లారీ బాడి బిల్డింగు కార్ఖానాలో వో అగ్నిప్రమాదం సంభవించి, నిముషాలమీద అది దావానలంలా పాకి, మొత్తం 34 వర్క్‌షాపులను చుట్టబెట్టిందట దాంతో పదహారు లారీలు భస్మమైపోయాయట ఆరు టీ షాపులు, ఏడు డీసెలు అమ్మే చిన్నసైజు షాపులు, కొన్ని చిన్న చిన్న కొట్లుకూడా అంటుకుచక్కా పోయాయట మొత్తం సుమారు 70 లక్షల రూపాయలు నష్టం సంభవించిందట సేలంనుంచి, ఆత్తూరు, ఈరోడ్డునుంచి వచ్చిన ఫైరు ఇంజనులు 11 వ తేదీ ఉదయం తొమ్మిదిగంటలవరకూ ప్రయత్నించి కూడా సంపూర్ణంగా అర్పలేక పోయాయట

## 17 ఏళ్ల అమ్మాయిని మానభంగం చేసిన బ్రిటిష్ మంత్రి !

బ్రిటనులో 17 ఏళ్ల అబలను పార్లమెంటు మెంబరు, మంత్రి అయిన జాన్ ఎలెను బలాత్కరించాడట షష్‌లాక్ మెయి టెన్ హాలుకు వో పార్టీకి వెళ్లి రాత్రి తిరిగి ఇంటికి వెళ్తున్న ఆమెను కారులోపోతున్న ఆయన లిఫ్ట్‌యిస్తానన్న నెపంతో తీసుకువెళ్లి బలాత్కరించి, అనుభవించాడట ఈ కేసు విచారించిన ఇప్స్విచ్ క్రవున్ కోర్టు జడ్జి బెర్ట్రండ్ రిచర్డ్ శిక్షను చదువుతూ యీ బలాత్కారానికి ఆపిల్ల పరోక్షంగా బాధ్యురాలనీ, అంత రాత్రివేళ వంటరిగా వెళ్లడం, ముక్కూముఖమూ తెలియనివాని లిఫ్ట్ ఒప్పుకోడము యీ బలాత్కారానిక్కారణాలన్నారట నిందితునికి, 35,600 రూపాయలు (మన లెక్కలో) జరిమానా విధించారట ఈ తీర్పును నిరసించి అశేష ప్రజలు, విశేష మహిళలూ వూరేగింపులు జరిపారట బలాత్కారం చేసిన వాడికి స్వల్ప అపరాధం విధించి, బాధింపబడిన ఆమెదీ నేరమే అని చెప్పడం వారు గర్హించారట ఆతనికి హీనపక్షంగానైనా జైలుశిక్ష వేయాల్సి ఉన్నదని ప్రకటించారట బలాత్కరించి స్త్రీని మానభంగం చేసిన వారికి జైలుశిక్ష విధిస్తూ శిక్షాస్మృతిని మార్చాలని కూడా వారు ఆందోళన చేశారట ఇలా చేయకపోతే డబ్బున్న ప్రతివాడూ వో అమ్మాయిని మానభంగంచేసి, ఫైనుకట్టి, ఫైనుగా పోతాడనివారు పేర్కొన్నారట దాంతో ప్రధాని మార్గరేట్ థాచ్చర్ ఆ మంత్రిని పదవినుంచి తొలగించారట అక్కడి ఆడవారిలో 25 శాతం మహిళలు స్త్రీని బలాత్కరించి, మానభంగం చేసిన మగవారి పురుషావయవం వృషణాలు శస్త్ర చికిత్సచేసి తీసివేసే శిక్ష విధించాలని అభిప్రాయ పడ్డారట బాబురోయ్ !

# ప్రకటించిన కార్యక్రమానికి బదులు....

## డాక్టర్ రావూరి భరద్వాజ

**...మ**రొకటేదో సర్దెయటం పెద్ద కష్టమేమీ కాదుగాని— అలా "సర్దుకు పోవడ" మున్నదే— ఆ కార్యక్రమ నిర్వాహకుని అజాగ్రత్తకూ, అలసత్వానికీ చిహ్నమని మాత్రం మనం మరచిపోకూడదు.

ప్రకటించిన కార్యక్రమం, ప్రకటించినట్టుగా జరిగితే ఎవరూ చెప్పుకోడానికేమీ ఉండదు మహా అంటే ఆ కార్యక్రమం తాలూకు బాగోగుల్ని గురించి కాస్సేపు కబుర్లాడుకోవచ్చు కానీ అన్నిసార్లూ, అనుకొన్నవి అనుకొన్నట్టుగానే జరగవు అలాగా జరగనప్పుడు ఒక్కొక్కసారి నానా రభసా అవుతుంది...

ఈ సందర్భంలో నా చిన్నప్పటి సంగతులు ఒకటి రెండు గుర్తుకొస్తున్నాయి ఆ రోజుల్లో రంగస్థల నాటకాలకు మాంచి గిరాకీ ఉండేది అద్దంకి, దొమ్మేటి, అబ్బూరి, మా బాబు, సి యస్సార్, తుంగల, స్థానం, వేమూరి వంటి మహా నటులూ, పూర్ణిమ, తిలకం, శ్రీరంజని, సభారంజని, రాధాబాయి, కృష్ణవేణి వంటి నటీమణులూ, జనం నోళ్లల్లో నానుతూ ఉండేవారు

గయోపాఖ్యానం, పాదుకాపట్టాభిషేకం, సత్య హరిశ్చంద్ర, ఉద్యోగ విజయాలు, తారా శశాంకం, కృష్ణ తులాభారం, రామదాసు, సతీ సక్కుబాయి, భక్త శ్రీయాళ, చింతామణి, నందనార్ వంటి నాటకాలను ఊరూరా, వాడవాడా ప్రదర్శించేవారు.

చిత్రమేమిటంటే— ఈ నటీనటులందరిదీ ఒక ఊరూ కాదు, ఒక జిల్లా కూడా కాదు నాటకం ఆడించదలచుకొన్నాయన—వీరందరి దర్శనమూ చేసుకొని, ఫలానారోజున, ఫలానా ఊళ్లో, ఫలానా నాటకం ఆడవలసి ఉంటుందని వీరందరికీ చెప్పి, సగం డబ్బు అడ్వాన్సుగా ఇచ్చి, మిగిలిన సగం—రంగు వేసుకోడానికి ముందుగానే — చెల్లించగలనని హామీ ఇచ్చి వచ్చేవారు

ఊళ్లోగా హాలు మాట్లాడుకోవడం, చుట్టు పక్కల పది ఊళ్లలో డప్పు పెట్టి ప్రచారం చేయడం, గోడలకు కాగితాలు అంటించడం, ఒంటెద్దు మీదనో, గుర్రబ్బండి మీదనో ఊళ్లన్నీ తిరిగి, కరపత్రాలు పంచడం— ఫలానా ఫలానా వారి దగ్గర టిక్కెట్లు దొరుకుతాయనడం— ఇదంతా ప్రచారానికి సంబంధించిన తంతు

అనుకొన్న వేళకు, అనుకొన్న నటీనటులు అందరూ వస్తే— కాంట్రాక్టర్ గారు నిబంధనల మేరకు— ముందుగానే డబ్బు చెల్లిస్తే— నాటకం పది గంటలకు ప్రారంభమయితే— తెల్లవారుజామున, ఏ నాలుగ్గంటలకో, అయిదు గంటలకో ముగిసేది. నాటకం చూశాక కాస్త కలిగినవారు ఇళ్లకెళ్లి పడుకునేవారు నాలాంటి వారు, అటునించి అటే పొలం పోయేవారు

నాకింకా బాగా గుర్తు— మా నాన్నగారికి నాటకాలంటే వెర్రి వ్యామోహం ఆయనతో బాటు— విధిలేక— నేనూ కొన్నిటికి హాజరవుతూ ఉండేవాణ్ని అప్పటికీ యిప్పటికీ నాటక రసాస్వాదనం చేయలేకపోవడం— నా దురదృష్టం! గోనె పట్టాల దిక్కుగా వేలు చూపిస్తూ—

"అదిగో ద్వారక, ఆలమంద లవిగో, అందందు గోరాగు నయ్యదియె కోట, అదే యగడ్త" అని ఏ మహా నటుడు పాడుతున్నా, అది ద్వారక, ఆ పక్కని ఆలమందలు అనుకోవడం నాకు చేతకాదు

ఓ దొప్ప ముఖం చింతామణిని చూస్తూ "వదనము చంద్ర బింబము, భాతి మిస మిసలాడుచున్న ఈ విలనాగ సౌందర్యము ననుభవించని వారి జన్మ— జన్మయా? హతవిధీ!" అని, ఓ బిల్వమంగళుడో మరో భవానీశంకరుడో విలా అనగలుగుతారో నా కిప్పటికీ అర్థం కాదు

వెదురు బొంగుల రంగస్థలాన్ని చూపుతూ "పాచి పట్టిన యట్టి పాషాణ స్థలమిది, యదుగుల మెల మెల్లనిడగవలయు, ఇప్పుడిపుడే కోసి, గాయెడ దర్భల ముందు జూసి పదంబు మోపవలయు" అని, సత్యవంతుడు, ఆనందభైరవిలో, సావిత్రికి చెబుతుంటే— మా నాన్నగారు "ఓహ్హో" "ఆహా" అనేవారుగానీ, నాకు మాత్రం నవ్వుగానే ఉండేది!

ఆ తరువాత ఎప్పటికో గానీ, నాకు బోధపడింది కాదు — నాటకం అనేది "అనుకోవడం" అన్న మానసిక క్రియ మీద పూర్తిగా ఆధారపడి ఉంటుందని! పూర్ణిమను చూసి, ఓ సారి "తార" అనుకోవడం, మరోసారి "చంద్రమతి" అనుకోవడం, ఇంకోసారి "సత్యభామ" అనుకోవడం — అద్దంకిని చూసి ఓసారి "శ్రీరాముడు" అనుకోవడం, ఇంకోసారి "హరిశ్చంద్రుడు" అనుకోవడం మరోసారి "ధర్మరాజు" అనుకోవడం—అప్పయ్యగారి పశువులకొట్టాన్ని "దేవీ మహల్" అనుకోవడం, గట్టుపుట్టి సందును, "హస్తినాపురి రాజవీధి" అనుకోవడం—నీకు చాతకాకపోతే, నాటకాన్ని నువ్వు ఎంజాయ్ చెయ్యలేవు

సరే —

ఇప్పటికే నేను, జపం విడిచి లొట్టల్లో పడ్డాను—మరో చిన్న సంఘటనను మనవిచేసి, అసలు విషయానికొస్తున్నాను ఆ రోజుల్లో, ఒక్కో నాటకంలో, ఒక్కో పాత్రను, ఇద్దరేసి, ముగ్గురేసి నటిస్తూ ఉండేవారు ఉద్యోగ విజయాల్లో, మొదటి కృష్ణుడు, రెండో కృష్ణుడు, మూడో కృష్ణుడు, నటించడం నాకు తెలుసు ఇద్దరు హరిశ్చంద్రులు, ఇద్దరు అర్జునులు, ముగ్గురు సత్యభామలూ, పోటా పోటీల మీద నటించడం, నాకు తెలుసు. ఒకటి రెండు నిమిషాల్లో ముగిసి పోవలసిన పద్యాన్ని, పావుగంట దాకా ఝూమ్మని పాడడం, పురజనుల కోరిక మీద, రెండేసి, మూడేసి దఫాలు, రకరకాల రాగాల్లో అదే పద్యాన్ని పాడడం— నా కింకా గుర్తున్నది.

పోనిండి —

నా నాటకాల అనుభవాలను, మరోసారి మనవి చేసుకొంటానని మనవి చేస్తూ ప్రస్తుతాని కొస్తున్నాను.

ఓ సారి —

అమరావతిలో ఉద్యోగ విజయాలాడు




తున్నారు. అందులో ముగ్గురు కృష్ణులున్నారు. ఏ కారణం వల్లనో, ఇద్దరు కృష్ణులు రాలేదు. ఈ సంగతి జనానికి తెలిసి, అల్లరి చేయడం ప్రారంభించారు. "ముగ్గురు కృష్ణులతో నాటక మాడిస్తానని ఎందుకు ప్రచారం చేశా"వని కాంట్రాక్టర్‌ను నిగ్గదీశారు జనం.

ఆఖరికి ఆ ఒక్క కృష్ణునితోనే పూర్తి నాటక మాడిస్తాననీ, అల్లరి చేయొద్దనీ, కాంట్రాక్టర్, కాళ్లావేళ్లా పడగ జనం చల్లబడ్డారు. కానీ ఈలోగా ఒకటోనెంబరు కృష్ణుడు, రణ పేచీ వేసుక్కూచున్నాడు. "నాకిచ్చిన అడ్వాన్సు, మూడో వంతు నాటకం వేషం వేయడానికే గానీ, మొత్తం నాటకానిక్కాదు గనుక నేను నటించ వలసిన అవసరం లే'దన్నాడు. బండి కుదిరిస్తే వెడతానన్నాడు. కుదర్చకపోయినా — క్షణం పాటయినా, ఉండనన్నాడు. "మిగిలిన ఇద్దరికీ ఇవ్వాల్సిన కిరాయీ నీకే ఇస్తా" నన్నా, ఆ నటుడు ఒప్పుకోలేదు. ఆఖరికి బతిమాలీ, బామాలీ, అతన్ని ఒప్పించారు! రెట్టింపు కిరాయి తీసుకొనే షరతుకు ఒప్పుకొని — మొత్తం నాటకాన్ని ఊదిపారేశాడా మహా నటుడు!

నాటకం బాగానే జరిగింది కానీ— ప్రేక్షకులు ఆ హాలును, ఫర్నిచర్ని ధ్వంసం చేశారు. ఆ దెబ్బతో, ఆ కాంట్రాక్టర్ తన కళాభిరుచికి విడాకులిచ్చి, తవుడుకొట్టు పెట్టుకొని, వేలు సంపాదించాడు. ప్రకటించిన కార్యక్రమం, ప్రకటించినట్టుగానే జరిగితే—ఆ కళా హృదయుడు, ఇంకెన్ని నాటకాలాడించి— కళామయం చేసేవాడో మనం అంచనా వేయలేం. అయితే— ఆర్థిక పరంగా— అతనిప్పుడున్నంత స్థితిమంతంగా మాత్రం అప్పుడు ఉండేవాడు కాదు.

ఫలానా తేదీన, ఫలానా చోట, ఫలానా పథకానికి ప్రారంభోత్సవమని ప్రకటిస్తారు. ఫలానా వారు అధ్యక్షులు, ఫలానా వారు స్వాగతోపన్యాసం చేస్తారు. ఫలానా వారు పూజ చేస్తారు, ఫలానావారు కత్తెర అందిస్తారు. ఫలానా ఫలానా వారు— రిబ్బను కత్తిరిస్తారు. పొరుగు రాష్ట్రం నుంచి వచ్చే ఫలానా వారు, ఈ మహోత్సవానికి ముఖ్య అతిథులుగా విచ్చేస్తారు— ఇదీ ప్రకటించిన కార్యక్రమం.

అన్నీ సక్రమంగా జరిగితే— అంతకన్నా కావల్సిందేమీ ఉండదు. కానీ, అధ్యక్షులవారు సమయానికి రారు— "ఇదిగో వస్తున్నారు— అదిగో వస్తున్నారు—బయలుదేరబోతున్నారు. బయలుదేరుతున్నారు — ఇప్పుడే కారు తలుపులు వేశారు— హమ్మయ్య— కారు వెళ్ళిపోయింది" అని కబుర్లు. కానీ- ఆ కారు ఎంతకీ రాదు. విసుగు, చిరాకు, ఆందోళన— కానీ ఇవేవీ పైకి అనడానికుండదు, ముఖంలో చూపించడానికి ఉండదు. అలా ఎదురు చూసి చూసి, చూసి- ఇహ నిలబడలేక, కూచోలేక— అటూ ఇటూ కాకుండా— వరగబడతారు కొంతమంది!

పురోహితుడు పెట్టిన ముహూర్తం దాటిపోయి, అప్పటికే మూడు గంటలు పైచిలుకు అయి ఉంటుంది. అప్పుడు తెలుస్తుంది కార్యక్రమ నిర్వాహకులకు, చావు వార్త చల్లగా! అధ్యక్షులవారు, హఠాత్తుగా మరో అర్జంటు పనిమీద ఎక్కడికో వెళ్ళారనీ, ఎప్పుడొస్తారో కూడా తెలీదనీ. పొరుగు రాష్ట్రపు పెద్ద మనిషి ధుమధుమలాడినప్పటికీ ఎవరి చేతులు వారే పిసుక్కోవటం తప్ప ఎవరు చేయగలిగిందేమీ ఉండదు. ప్రారంభోత్సవ కార్యక్రమం కాస్త ఆలస్యంగానైనా ప్రారంభించడమా? లేక మరో నాటికి వాయిదా వేయడమా? సులభంగా జవాబు దొరకని అనేక చిక్కు ప్రశ్నల్లో ఇదొకటి!

ప్రణాళికా రచనా సంఘంవారు లోకాభ్యుదయం కోసం, అనేక కార్యక్రమాలను ముందుగా ప్రకటిస్తారు. భారీ నీటిపారు ●

పథకాలు; మధ్యతరహా, చిన్నతరహా సాగునీటి పథకాలు; గ్రామం ప్రాంతాలలో రోడ్ల నిర్మాణం, గ్రామీణ ప్రాంతాలకు మంచినీటి సరఫరా, వరద నిరోధక పథకాలు, గృహ నిర్మాణ కార్యక్రమాలు, ఉక్కు, ఇనుము పరిశ్రమలు, ఎరువులు, రసాయనాలు ఔషధాలు, వైద్య, ఆరోగ్య కార్యక్రమాలు; సాధారణ విద్య, సాంకేతిక విద్య, హరిజన; గిరిజన సంక్షేమం, విద్యుదుత్పత్తి, సహకార రంగం, రోడ్లు, భవనాల నిర్మాణం, రవాణా సదుపాయాల కల్పన, అణుశక్తి— అంతరిక్ష పరిశోధనలు; మొదలైన సంక్షేమ కార్యక్రమాలను వారు ప్రకటిస్తారు.

ఈ ప్రకటించిన కార్యక్రమాలు— యథాతథంగా అమలు జరగడంలేదని—అప్పుడప్పుడు వింటుంటాం

తొట్ట తొలిగా ప్రకటించిన కార్యక్రమానికి బదులు— మరో కార్యక్రమం ఆకస్మికంగా ప్రత్యక్షమవడం కూడా తెలుసు. దేశం మొత్తానికి సంబంధించిన కార్యక్రమాల్లో మార్పులూ చేర్పులూ ఎటుగూడి తప్పవనుకోండి కానీ, వ్యక్తిగత విషయాల్లో కూడా—ఏదో రూపంలో ఈ "బదులుగా" అన్న కార్యక్రమం తప్పడంలేదు.

## ప్రకటించిన...

మీ అబ్బాయి చదువును గురించో, మీ అమ్మాయి పెళ్ళిని గురించో ఓ భారీ కార్యక్రమాన్ని ఉత్సాహంగా ముందు ప్రకటించారనుకోండి అనుకొన్నట్టుగా, అబ్బాయిగారు అన్ని పరీక్షల్లోనూ, అలవోకగా ఉత్తీర్ణుడు కాలేదనుకోండి ఒక్కొక్క క్లాసులో రెండేసేళ్ళు పీఠం వేశారనుకోండి మీరు ఉద్యోగ విరమణ చేసే వేళకు, యువరాజా వారింకా మెట్రిక్ గణుపును టలేదనుకోండి— అప్పుడు అబ్బాయి పరంగా, మీరు లోగడ ప్రకటించిన కార్యక్రమానికి బదులు... ఇంకేదో చేయక తప్పదు.

అవునా?

అలాగే!

మీ అమ్మాయికి సంబంధం కుదిరింది! కట్నాలు నిషేధం గనుక, మీ కాబోయే వియ్యంకుడు కట్నం అడగరు కానీ— ఓ స్కూటరు మాత్రం— అడుగుతాడు. అమ్మాయికి బాల తొడుగుకింద "ఇంత బంగారం" ఉండాలని నిక్కచ్చి చేస్తారు మీరూ "సరే" నంటారు. తీరా లగ్నం వేళకు, మీరు కొందామనుకొన్న బంగారం ధర మీకందుబాటులో ఉండదనుకోండి— స్కూటర్ ధర వేల మీద పెరిగిందనుకోండి! అప్పుడు- మీరు లోగడ ప్రకటించిన భారీ కార్యక్రమానికి బదులు— ఇంకోటేదో, సవరింపులతో, కుదింపులతో, ఏర్పాటు చేసుకోంటారా? లేదా? ఈ సవరింపుల వల్లా, కుదింపుల వల్లా, పెళ్ళి పందిరి రణరంగంగా మారుతుందా లేదా? ఈ కారణాల వల్లనే పీటల మీద పెళ్ళిళ్ళు కూడా చెడిపోయిన దాఖలాలున్నాయా లేదా ?

"ప్రకటించిన కార్యక్రమం, ప్రకటించిన విధంగా— అక్షరాలా అమలు జరిపిందాకా— మీ అమ్మాయిని మీ దగ్గరే ఉణ్నీండి' అన్న అల్లుళ్ళను, తమరు చూశారా లేదా?

ఇవేవీ అపురూపమైనవీ కాదు, అసంభావ్యమైనవీ కాదు ఇందులో ఏ ఒక్కరి చిత్తశుద్ధినీ మనం శంకించవలసిన అవసరం లేదు

ఏందు కంటారా ?

మాట వరసకు మీ సంగతే తీసుకుందాం—

ఇవ్వాళ మీ వివాహదినోత్సవం ఈసందగను బ్రహ్మాండంగా జరుపుకొందామని— గత వారం రోజులుగా మీ దంపతులిద్దరూ, రకరకాల కార్యక్రమాలనూ తయారు చేసుకొన్నారు. అందులోనూ— తొలివార్షికోత్సవం




## చూడండి, ఇక్కడ
## చిక్కని, కమ్మని టీ ఉన్నది

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్ష చేసి చూడండి టాప్‌స్టార్ అన్నిటికన్నా మెరుగు మరే ఇతర టీకన్నా చిక్కనిది — చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్

ఎందుకంటే, ప్రత్యేకమైన భారతీయ తేయాకుల తాలూకు ఘాటైన (స్ట్రాంగ్) సమ్మేళనం నుంచి తయారైంది లిప్టన్ టాప్‌స్టార్ .. సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ కోరుకునే వారి కోసం!

500 గ్రా
250 గ్రా 100 గ్రా లలో
దొరుకుతుంది




# లిప్టన్
# టాప్ స్టార్ టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LINTAS-LTS-8 231-TL

గనుక- మీ ఉత్సాహం వరద లెత్తి దరులొరసి పారుతూ ఉంటుంది

రోజూ మాదిరిగా పొద్దెక్కి లేవకుండా- అలారం పెట్టుకుని- కన్నకను చీకటి ఉన్నప్పుడే లేవడం- ఒకరి కళ్ళల్లోకి మరొకరు చూచుకొంటూ- కాఫీ తాగడం- తరువాత స్నానం- దేవాలయానికి వెళ్ళడం- వచ్చే ఏడాది కన్నా గుమ్మడి పండులాంటి బుజ్జి నాన్న కావాలని మొక్కు కోవడం ఇదీ ఉదయం పూట కార్యక్రమం! ఆవిడేమో- మీరు పదేపదే ముచ్చట పడే వెడల్పంచు కంచి పట్టుచీరె కట్టుకుంటానని, నీలం రంగు జాకెట్టు వేసు కొంటాననీ, సన్నగా కాటుక పెట్టు కొంటాననీ, పెళ్ళి నాటి నగల్లో - తాకట్టులో ఉన్నవిగాక - మిగిలిన వాటిని వేసుకొంటాననీ అన్నది మీరేమో బుగ్గన పొదు చుక్క కూడా పెట్టుకో మన్నారు మీ చేత బతిమిలాడించు కొందా మన్న సదుద్దేశంతో, మీ ఆవిడ - చప్పన ఇందుకు ఒప్పుకోలేదు దీనికి బదులుగా - సదస్యమప్పుడు మీరు వేసుకొన్న సూటే వేసుకోమని ఆవిడ కోరింది బుగ్గ చుక్కను ఓ నిమిషం పాటు అద్దంలో చూసుకొనే దాకా ఉంచుకొని ఆ తరువాత తుడిచివేసే షరతు మీద మీ ఆవిడ ఒప్పుకొన్నది. మీరూ మెత్తబడి "సరే" నన్నారు

ఈ పూట వంట మానేశారు అసలు మీకు ఆకలే కాలేదు నిన్న చేసిన స్వీట్స్ తిని, కాఫీ తాగి, షాపింగ్ కెళ్ళి - పార్కులో, ఓ మూలగా కూచుని, తియ్యని కబుర్లాడు కొని, పదిమిదింటికి హోటల్లో భోజనం చేసి రెండో ఆట సినిమా చూదామనీ అనుకొన్నారు

# ప్రకటించిన

ఆటోరిక్షాలో కాకుండా- మామూలురిక్షాలో, ఒదిగొదిగి కూచుందా మనీ, గతుకులొచ్చిన ప్రతిసారీ, అవసరాన్ని మించి ఆమె కేసి ఒరుగుదా మని మీ మట్టుకు మీరను కొన్నారు.

ఈ రిక్షా వ్యవహారం తప్ప మిగిలినవన్నీ, ఇలా - ఇలా - ఇలా జరగాలనీ, జరుపుకొందా మనీ, మరో కార్యక్రమాన్ని తయారు చేసుకొన్నారు దీన్ని అక్షరాలా అమలు జరపడం కోసం—మీరీ రోజున సెలవు కూడా పెట్టారు.

## స్నేహితుడు

ఆనందం  
వస్తాడెప్పుడో  
చుట్టం చూపుగా  
అవును  
ఆనందం నాకు చుట్టం  
కానీ  
విషాదం నా స్నేహితుడు  
నా గుండెలోనే  
కాపురం వాడికి  
వింతైనా స్నేహితుడు కదా

— మల్లిక్

కాని—ఏం లాభం ?

నిన్న సాయంత్రం మీ సెలవు మంజూరు చేసిన ఆఫీసరుగారే మిమ్మల్ని అర్జంటుగా, ఆఫీసుకు పిలుచుకు రమ్మని మనిషిని పంపించారు ఆ వచ్చిన వాడికి, రెండో మూడో ఇచ్చి, 'ఇంట్లో లేరని చెప్పమను' దామని కూడా మీరు చూశారు. వాడో జిడ్డు వెధవ, మిమ్మల్ని వదలేదు. ఇప్పుడు చెప్పండి! ఇందులో మీ నిజాయితీని శంకించడానికి వన్నా ఆస్కారం ఉన్నదా ? లేదుగా!

ఇదే విధంగా—

మనం ఏంతో చిత్త శుద్ధితో, ప్రకటించిన ఓ కార్యక్రమానికి బదులు "అనివార్య కారణాల"వల్ల— అప్పుడప్పుడు మరో కార్యక్రమాన్ని చేపట్టక తప్పదు ఇలా జరగడం నిజంగా దురదృష్టమే! కాదనను

మన పూర్వజన్మ సుకృత విశేషం వల్లా, మన పితృదేవతల ఆశీర్వచన బలం వల్లా— "అనివార్య కారణాలు" అన్న వాక్య మొకటి అడుగడుగునా, మనల్ని ఆదుకోబట్టి గానీ, లేకపోతే ఈ బదులుగా వచ్చే కార్యక్రమా లను సమర్థించడానికి, మనకున్న సమయం— ఎంత మాత్రం సరిపోదు

చివరగా ఒక్క మనవి!

భగవంతుని సాక్షిగా చెబుతున్నాను! నన్ను నమ్మండి !!

ఇదీ—

"ప్రకటించిన కార్యక్రమానికి బదులు"గా ప్రసారమవుతున్న కార్యక్రమం కాదనీ, దీని శీర్షిక ఇదేననీ గ్రహించండి! చాలు!! దయచేసి నా చిత్తశుద్ధిని మాత్రం శంకించకండి!

రంగుల బొమ్మల కథ

బాపు













అరే! మళ్ళీ బాగా పొడుగయ్యాను - మెడ ఇలా సాగిపోయిందేమిటో?? కాస్త అదీ కాస్త ఇదీ తింటూ ప్రయత్నిస్తాను!

ఇదేదో కొత్త రకం కొండచిలువలా వుందే!

అమ్మయ్య! చివరకు నా మామూలు పొడుగుకి వచ్చాను - ఇక ఇక్కడ్నుంచి ఎక్కడికెళ్ళాలి!

బాపు



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "గోపాలకృష్ణుడు"లో కోపాలకృష్ణుడు

పున్నమి చంద్రుడు... చల్లని పిల్లవాయువు... వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. గోపాలకృష్ణ (ఎ. ఎన్. ఆర్.) ఉషారుగా మంచం మీద మల్లెపువ్వులు చల్లాడు. అమాంతంగా ఎక్కడో కొంపలు అంటుకుపోయినట్లు తండ్రి కబురు చేశాడు; విశాఖ వెళ్ళి, అక్కడ కొన్ని వ్యవహారాలు చూసుకురమ్మన్నాడు. ముఖ్యమైన విషయంలో జాగు చేయకూడదని "డోన్ట్ డిలే ఇన్ ఇంపార్టెంట్ మేటర్స్" అంటూ ఆంగ్లంలో కూడా సెలవిచ్చాడు మరి. గోపాలకృష్ణకు ఓవైపు బాధ; మరోవైపు కోపం. కాని, తండ్రి హుకుంను జారీ చేయక తప్పదు.

మామగారి పిలుపు విన్న సుజాత (జయసుధ) హడావిడిగా పెట్టెలో బట్టలు సర్దసాగింది. "ఏమండీ, ఈ బ్రౌన్ సూట్ పెట్టనా?" అని అమాయకంగా అడిగేసరికి గోపాలకృష్ణకు చిర్రెత్తుకొచ్చింది. "గాడిద గుడ్డు పెట్టు!" అన్నాడు. సుజాత కొయ్యబొమ్మలా నిలుచుండిపోయింది. గోపాలకృష్ణ విసుగ్గా "పెళ్ళాంతో కాపరం చెయ్యటం — బాధ్యత కాదా? డోన్ట్ డిలే ఇన్ ఇంపార్టెంట్ మేటర్స్ — అని పెద్ద ఇంగ్లీషు కొటేషన్! ఈ ముసలోడికి ఏమీ పనిలేదు," అని విసుక్కున్నాడు. అతని అవస్థకు సుజాత లోలోన నవ్వుకుంది.

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో భీమవరపు బుచ్చిరెడ్డి నిర్మించే జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ "గోపాలకృష్ణుడు" చిత్రానికి ఇటీవలం కేరళలో కొన్ని పాటలు చిత్రీకరించబడ్డాయి. నిర్వహణ: బి. అంజిరెడ్డి.

## "జగన్నాథ రథ చక్రాలు"లో శ్రమజీవుల వ్యధలు

రాము (సత్యనారాయణ) కంగారుగా ఇంట్లో కొచ్చి, "అమ్మా, రేపటినుండి నీకు మిగిలేది ఒక్కడే కొడుకు," అన్నాడు.

కాంతమ్మ కంగారుపడింది. "ఏమిట్రా? ఒరేయ్, నా కిష్టుడి కేమయిందిరా?" అంది.

"అమ్మా, వాడు స్ట్రయిక్ నోటీస్ ఇచ్చాడమ్మా. రేపు వర్కర్స్ అందర్నీ వెంటేసుకుని, సమ్మె జరపబోతున్నాడు అది జరగకుండా ఆపాలని రంగారావుగారు పోలీసు బందోబస్తు చేస్తున్నారు. తప్పకుండా పోలీసులకూ, వీళ్ళకీ ఘర్షణ జరుగుతుంది. కాల్పులు కూడా జరగవచ్చు."

"ఒరేయ్, పదిమందికీ న్యాయం జరగాలని పోట్లాడేవాడిమీద గుళ్ళు పేలుస్తారా? అందరికీ కడుపునిండా అన్నం దక్కాలని ఆవేదన పడేవాడిని పోలీసులు పేలుస్తారంటావా? వీల్లేదురా!" అని ఆవేశంతో ఊగిపోయే తల్లిని రాము పట్టుకుని, "అందుకే నేను ముందే చెప్పాను. ఈ యూనియన్లు, సమ్మెలు పేదవాళ్ళకు ప్రమాదం తెచ్చేవే తప్ప — పెద్దవాళ్ళకు నష్టం తెచ్చేవి కావని. ఆ గొడవలకు వాడ్ని వెళ్ళొద్దన్నాను...కాని, వాడు—" అంటూండగా కాంతమ్మ ఒక్కసారిగా విదిలించుకుంది. "ఏమిట్రా నువ్వు మాట్లాడేది? ధర్మం కోసం పోరాడటం



'ప్రేమ నక్షత్రం'లో కృష్ణ, శ్రీదేవి

తప్పంటావా? మోసాన్ని ఎదిరించటం పాపమంటావా? ఒరేయ్, ఆ కాల్చి చంపేవాళ్ళు నాపిచ్చి వెధవలురా! కాల్చమనరా — ఎట్లా కాలుస్తారో! ముందు నన్ను కాల్చి, ఆ తర్వాత వాణ్ణి కాల్చమనరా! కాల్చమనూ!" అంటూ స్పృహ తప్పి పడిపోయింది.

చరిత చిత్ర సమర్పించే ఎ. యం. డి. ప్రొడక్షన్స్ "జగన్నాథ రథ చక్రాలు"లో కృష్ణ హీరో.

## నమోదు చేయబడిన చిత్రాల పేరు

రాధాకృష్ణ మూవీస్ "దెబ్బతిన్న పులి", ఆదిత్య పిక్చర్స్ "గుండెల్లో నిదుర పోతా", అభ్యుదయ ఆర్ట్ క్రియేషన్స్ "ఇంకా తెల్లవారదేమి?", రూబీ మూవీస్ "సముద్రం ఎరుపెక్కింది", చంద్రశేఖర్ ప్రొడక్షన్స్ "సింహంతో చెలగాటం", అరుణోదయ పిక్చర్స్ "చుక్కలూరు చుక్కమ్మ", సత్య అన్నపూర్ణ మూవీస్ "కల్యాణ తిలకం", వెంకటకృష్ణ ఫిలిమ్స్ "మహానటి", శ్రీ లక్ష్మి ఆర్ట్ క్రియేషన్స్ "ఓ తండ్రి కథ", రాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ "పగటి దొంగలు", శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ "రగిలే గుండెలు", తిరుపతి ప్రొడక్షన్స్ "విజయ్ విక్రమ్", బాబు చిత్ర "అగాధంలో ఆడవాళ్ళు", శ్రీ శరత్ ఆర్ట్స్ "చిరంజీవి చినబాబు", రాకేష్ ఆర్ట్ పిక్చర్స్ "గోడమీద బొమ్మ, నువ్వు నా భార్యవు కాదు", రాధా చిత్రా కంబైన్స్ "ఉమర్ ఖయ్యాం", అర్చన క్రియేషన్స్ "పట్నంలో పెద్దమనుషులు", అన్నపూర్ణ పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్ "పెళ్ళీడు పిల్లలు", లక్ష్మీ దివ్యజ్యోతి ప్రొడక్షన్స్ "తెలుగు వీరులు", విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "కొండవీటి దొంగ", దివర్ ఫిలిమ్స్ "రంగా", నవ్యకళ చిత్ర "ఉరుములు మెరుపులు".

'గోపాల కృష్ణుడు'లో జయసుధ, అక్కినేని నాగేశ్వరరావు



# పట్టువలె మృదువైనది
# పగడంవలె అందమైనది







## పాండ్స్
## వ్యానిషింగ్ క్రీమ్

నాజూకుగావుండే అనువైన మేకప్
ముఖ పౌడర్‌కి సంపూర్ణమైన ఆధారం
చర్మానికి ఉత్తమమైన రక్షణ

POND'S

## ప్రముఖ పారిశ్రామికవేత్త ఎల్. వి. రామయ్య సారథ్యంలో 'మద్రాసు విశ్వవిద్యాలయం' శత జయంత్యుత్సవాలు

ఎలిమెంటరీ స్కూలుతోనే ఎల్. వి. రామయ్య విద్యాభ్యాసానికి అంతరాయం కల్గినా, 1982 సెప్టెంబర్‌లో వైభవోపేతంగా జరిగే మద్రాసు విశ్వవిద్యాలయం వంటి అగ్రశ్రేణి విద్యా సంస్థ శత జయంత్యుత్సవాల నిర్వహణకు, ఆతిథ్య సంఘానికి అధ్యక్షులుగా ఎన్నుకోబడడం ముదావహం. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి, రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, కేంద్ర మంత్రులు, రాష్ట్రమంత్రులు, విద్యావేత్తలు, క్రీడాకారులు, మేధావులు, దాదాపు రెండు వేలమంది ప్రతినిధులు మూడురోజులపాటు జరిగే ఈ కార్యక్రమాల్లో పాల్గొంటారు. నిర్వహణ సంఘంలో ప్రముఖ నిర్మాత, పాత్రికేయుడు వాసిరాజు ప్రకాశం ఒక సభ్యుడవడం మరో విశేషం.



"మీ 'లేతవయసు' సినిమాలో హీరోయిన్ వేషం ఇప్పించండి. మీ ఋణం వుంచుకోను!"

## త్వరలో విడుదలయ్యే "భక్త ధ్రువ మార్కండేయ"

"స్వర్గానికి నరకానికి ఎంత దూరముంటుందో చెప్పగలరా? నేను చెప్పనా? నాలుగు ఫర్లాంగులు," అన్నారు భానుమతీ రామకృష్ణ. "ఎలా?" అన్నాను. "మా భరణీ స్టూడియోలో స్వర్గం సెట్ వేశాం. వాహిని స్టూడియోలో యమలోకం సెట్ వేశాం. రెండు స్టూడియోలకూ మధ్య దూరం అరమైలు ఉంటుంది," అన్నారామె నవ్వుతూ. వంశీ, రోహిణి, శోభన, సుధ, రాణి, కవిత, మహేష్, రాజశ్యామల, బాబు, రవిశంకర్, చంద్రశేఖర్, మూర్తి, రాజాచంద్ర, ఆనంద్, జూనియర్ ఆనంద్ వగైరా బాల తారలు అత్యద్భుతంగా నటించిన ఈ చిత్రానికి ఎస్. రాజేశ్వరరావు సంగీతం, కె. ఎస్. ప్రసాద్ ఛాయ, పెండ్యాల వెంకటేశ్వరరావు సహకార దర్శకత్వం, ఆత్మ కూర్పు తెరవెనుక హంగులు. కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, సంగీత పర్యవేక్షణ, దర్శకత్వం : డాక్టర్ భానుమతీ రామకృష్ణ.

# "కేర్‌ఫ్రీ రక్షణ
# –దానిలా మరొకటి లేదిక!"



మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రతో కూడిన ఆ సంరక్షణని యిస్తుందిది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం.

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి. కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది. అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమిడికగా ఉంటుంది.

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే. క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3-వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు.

ఎంతో సౌకర్యం. మరెంతో వీలు.

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది. దీన్ని వాడటం. పారెయ్యడం ఎంతో తేలిక...దీన్ని ఫ్లష్ చేసెయ్యండి. అంతే. మార్చుకోవడం కూడా వీలు. మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం.

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక. అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు. మీరిక ఏం చెయ్యదలుచుకున్నా బేఫికరుగా చేయగలరు మరి...ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది.




* Trademark © J&J '81

Johnson & Johnson*

**కేర్‌ఫ్రీ* – కాలం మారుతున్న యీ రోజుల్లో పూర్తి రక్షణ.**

# సినిమా

## మాదాల రంగారావు "ప్రజాశక్తి"

"దోపిడీదారులు — పీడిత ప్రజానీకానికి మధ్య జరిగే కథ ... బలహీనవర్గాలవారి కంఠాన్ని ఏ మదాంధులూ నొక్కలేరు. అలా నొక్కడానికి ప్రయత్నిస్తే, ప్రజాశక్తి తిరగబడుతుంది. ఈ అంశం ప్రధానంగా మలచబడిన మరో విప్లవాత్మక చిత్రం — ప్రజాశక్తి," అన్నారు మాదాల రంగారావు. ఈయన మేలో షూటింగ్ ప్రారంభించే కొత్త చిత్రానికి ఎం. జి. రామారావు సంభాషణలకర్త. ఆర్. రామారావు ఛాయాగ్రాహకుడు, కొమ్మినేని కృష్ణమూర్తి దర్శకుడు.

## కలవారి సంసారం

"కృష్ణ, శ్రీదేవి, జానకి, అల్లు రామలింగయ్య, రాజసులోచన ముఖ్య పాత్రధారులు," అన్నారు కె. ఎస్. రామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో దోనేపూడి బ్రహ్మయ్య నిర్మించే మహేశ్వరీ కంబైన్స్ "కలవారి సంసారం" చిత్రం షూటింగ్ ఏప్రిల్ 19న ప్రారంభమైంది. డి. వి. నరసరాజు సంభాషణలకర్త. కె. వి. మహదేవన్ సంగీత దర్శకుడు.

## కొమ్మినేని, గిరిబాబుల మెరుపు దాడి

"తిరుపతి దగ్గర తలకోన అడవుల్లో ఒకే షెడ్యూల్లో షూటింగ్‌ను ముగిస్తాం," అన్నారు కొమ్మినేని శేషగిరిరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నటుడు గిరిబాబు సమర్పించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మెరుపుదాడి" చిత్రానికి పి. దేవరాజ్ పర్యవేక్షణలో జయకుమార్ ఛాయాగ్రాహకుడు. చక్రవర్తి సంగీత దర్శకుడు. మేలో పాటలు రికార్డ్ చేయబడతాయి. జూన్, జూలై మాసాల్లో షూటింగ్ పూర్తవుతుంది.

## మహిజా ఫిలిమ్స్ చిత్రంలో ఎ. ఎన్. ఆర్.

ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో నిర్మాత చెరుకూరి ప్రకాశరావు అక్టోబర్‌లో ప్రారంభించే చిత్రంలో ఎ. ఎన్. ఆర్. సరసన శ్రీదేవి నాయిక.

## "మా ఇంటి గొడవ"

"జె. వి. సోమయాజులుగారు ఒక కొత్త తరహా పాత్రలో కనిపిస్తారు," అన్నారు పి. డి. ప్రసాద్. ఈయన దర్శకత్వం వహించే మారుతీ చిత్రాలయ వారి పై చిత్రం షూటింగ్ మే 1 నుంచి హైదరాబాద్‌లో నెలాఖరువరకు స్టూడియోలోను, ఆ తర్వాత ఔట్‌డోర్‌లోను జరుగుతుందని నిర్మాత జి. ఎం. రావు తెలియజేశారు. శరత్‌బాబు, మానస, నాగేష్, రమాప్రభ, జానకి ముఖ్య పాత్రధారులు. కామెడీ ద్వారా సందేశమిచ్చే ఈ చిత్రానికి కథ, మాటలు ఆదివిష్ణు రాశారు. గోపి గీతాలకు ఎ. ఎ. రాజ్ స్వరకల్పన చేశారు. ఉదయరాజ్ ఛాయ, చంద్ర శిల్పం, అంకిరెడ్డి కూర్పు, శేషు నృత్యాలు నిర్వహిస్తారు.

## ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో డి. వి. ఎస్. రాజు హిందీ చిత్రం

"ప్రసాద్‌గారు ఇతర సంస్థల చిత్రాలకు దర్శకత్వం వహించి చాలాకాలమైంది. నా మొదటి హిందీ చిత్రాన్ని డైరెక్ట్ చేయడానికి అంగీకరించినందుకు ఎంతైనా కృతజ్ఞుడ్ని," అన్నారు నిర్మాత, నేషనల్ ఫిలిమ్ డెవలప్ కార్పొరేషన్ అధ్యక్షులు డి. వి. ఎస్. రాజు. ఏప్రిల్‌లో సెట్స్‌కు వెళ్లే ఈ చిత్రం "న్యాయం కావాలి" ఆధారంగా నిర్మింపబడుతుంది. మాటలు : రాహీ మాసూర్ రాజా. గీతాలు : ఆనంద్ బక్షి. సంగీతం : లక్ష్మీకాంత్ ప్యారేలాల్.

## వి. మధుసూదనరావు దర్శకత్వంలో కల్యాణబంధం

ఆర్. వి. రమణమూర్తి నిర్మించే లలితశ్రీ కంబైన్స్ "కల్యాణబంధం" చిత్రంలో శ్రీదేవి నాయిక అని డైరెక్టర్ వి. మధుసూదనరావు తెలిపారు.



'జస్టిస్ చౌదరి'లో ఎన్. టి. రామారావు, శ్రీదేవి

## పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో తోలకరి జల్లు

"చక్కని ప్రేమకథ ... ప్రస్తుతం పేపర్ వర్క్ జరుగుతోంది. 'జగ్గు, పగబట్టిన సింహం' పూర్తవగానే ఈ ఎస్. ఎల్. మహావీర్ 'తొలకరి జల్లు' షూటింగ్ మొదలెడ్తాను," అన్నారు పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కొత్త చిత్రంలో కృష్ణ, శ్రీదేవి నాయికా నాయికలు. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఎస్. పరంధామరెడ్డి నిర్మాత.

## డైరెక్టర్ కె. విశ్వనాథ్ కొత్త చిత్రాలు

"సప్తపది" చిత్రం ద్వారా తెలుగు సినిమా రంగానికి రెండవసారి జాతీయ గౌరవాన్ని తెచ్చిపెట్టిన కె. విశ్వనాథ్ దర్శకత్వంలో "శంకరాభరణం, సీతాకోక చిలుక" అవార్డు చిత్రాల నిర్మాత ఏడిద నాగేశ్వరరావు జూలై మొదటివారం నుంచి చిత్రీకరణ మొదలెట్టే చిత్రానికి పాటలు మే నెలలో రికార్డవుతాయి. జంధ్యాల సంభాషణలకర్త. ఇళయరాజా సంగీత దర్శకుడు.

జయకృష్ణా మూవీస్ అధినేత కె. జయకృష్ణ నిర్మించే చిత్రానికి స్క్రిప్ట్ వర్క్ జరుగుతోంది.

# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా!

Bournvita

Bournvita

## తాగండిక బోర్న్‌విటా.

మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహా యిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి. దీన్ని తయారుచేసింది, 100 సంవత్సరాలకు పైగా ఆరోగ్య పానీయాలు తయారు చేయడంలో ప్రత్యేకత గణించిన క్యాడ్‌బరీవారు.

**క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా**

దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక.




డబ్బు ఆదా చెయ్యండి...
అందరూ కోరుకునే
రీఫిల్ ప్యాక్ తెచ్చుకోండి!



'నాలుగు స్తంభాలాట'లో నరేష్, పూర్ణిమ

# చిత్ర విచిత్రాలు!

★ ఎం. జి. ఆర్. ఒకే ఒక చిత్రానికి కథ రాశారు. ఆ తమిళ చిత్రం పేరు "కణవన్" (భర్త).

★ ఒకరోజు అమితాబ్‌బచ్చన్ కొడుకు అభిషేక్ "మా క్లాసులో ఒక్క పంకా అయినా లేదు. చాలా ఇబ్బందిగా ఉంది," అని మొరపెట్టుకున్నాడట. ఆ అబ్బాయి తరగతిలో మాత్రమే పంకా వేస్తే బాగుండదని ఆ స్కూల్లో అన్ని క్లాసులకూ పంకాలు ఏర్పాటు చేశాడట అమితాబ్‌బచ్చన్.

★ "స్టార్ వార్స్" చిత్రాన్ని బ్రిటిష్ టెలివిషన్‌లో ప్రదర్శించడానికి 30 లక్షల డాలర్లు చెల్లించబడ్డాయట.

★ "నిజంగా దేవుడు ఉన్నాడేమో!" అంటాడు "నాస్తిక్" హిందీ చిత్ర నిర్మాత. అయినా చిత్రాన్ని ఏ దుర్ముహూర్తాన ప్రారంభించాడోగాని, మొదట అమ్జద్‌ఖాన్‌కు జబ్బుచేసి, ఒక సెట్‌ను కేన్సిల్ చేశారు. ఆ తర్వాత హేమమాలిని గర్భవతిగా ఉన్నప్పుడు మరో సెట్‌ను రద్దు చేయవలసి వచ్చింది. ఇటీవల అమితాబ్‌బచ్చన్ సుస్తీవల్ల ఇంకో సెట్టు కేన్సిల్ చేయకతప్పింది కాదు.

★ మార్చి 9న 'ఆస్కార్ అవార్డు'ల సందర్భంలో "జూమ్‌లెన్స్" కనిపెట్టిన జోసఫ్ వాకర్, 12 జేమ్స్‌బాండ్ చిత్రాలు నిర్మించిన ఆల్బర్ట్ కబ్బీ బ్రాకోలీ గౌరవించబడ్డారు.

★ సంగీత దర్శకుడు లక్ష్మీకాంత్ కుమార్తె రాజేశ్వరి ఇటీవల "భగవత్" చిత్రంలో ఓ పాటపాడింది.

★ 'బాంబే డైయింగ్'కు చెందిన నస్లీవాడియా అనే వివాహితుని మోహంలో పడిందట జీనత్‌అమన్.

★ ప్రముఖ కార్టూన్ చిత్రాల నిర్మాత కీ॥శే॥ వాల్ట్ డిస్నీ తొలుదొల్త అంబులెన్స్ డ్రయివర్‌గా పనిచేశాడట. చిత్రమేమిటంటే సుప్రసిద్ధ రచయితలు ఎర్నెస్ట్ హెమింగ్వే, రాబర్ట్ హిల్లర్, సోమర్‌సెట్‌మామ్‌లు కూడా ఆదిలో డ్రయివర్లుగా పనిచేసినవారే.

★ మొట్టమొదట సారిగా సినిమా థియేటర్లలో రిజర్వేషన్ పద్ధతి ప్రవేశపెట్టింది మాంచెస్టర్‌లోని 'గెయిటీ థియేటర్'లో టిక్కెట్లు కొని గుంపులు గుంపులుగా జనం ఆ హాలులోకి వెళ్లి సీట్లకోసం గొడవ పడుతూంటే, కుర్చీలకు — టిక్కెట్లకు నెంబర్లువేసి రిజర్వేషన్ పద్ధతికి దారి చూపింది ఆ థియేటర్.

★ కన్నడ నటి భారతి కుమారిగా ఉన్న రోజుల్లో 'త్రోబాల్' పోటీలలో ఎన్నోసార్లు కప్పులు గెలుచుకుంది. ఇప్పుడామె కర్నాటక రాష్ట్ర త్రోబాల్ అసోసియేషన్‌కు, కర్నాటక లేడీస్ క్రికెట్ అసోసియేషన్‌కూ ఉపాధ్యక్షురాలు.

★ ఫిబ్రవరి 23న ఔరంగాబాద్‌లోని ఓ థియేటర్‌లో అగ్నిప్రమాదం సంభవించింది. ఇద్దరు మహిళలతోపాటు మొత్తం 16 మంది మరణించారు. 30 మంది తీవ్రంగా గాయపడ్డారు.

★ జలగాంలో ముస్లిమ్ మహిళలు సినిమాలు చూడకూడదని ఆంక్ష. దాన్ని ఉల్లంఘించి ఓ సినిమాను చూసిన ఒక యువతి పెదవులను ఒక యువకుడు కోసేశాడట. అందుకు నిరసనగా మిస్ రషీదా అనే యువతి తెగించి, తనతోపాటు 40 మంది యువతులను "మేరీ ఆవాజ్ సునో" సినిమాకు తీసుకెళ్లింది.

★ కాంతారావు మనుమడు సుశాంత్‌రే వయస్సు 18. ఆరడుగుల పొడవుగల ఈ యువకుడు కాంతారావు దర్శకత్వం వహించే "జన్నార్" చిత్రంతోపాటు ఎల్. వి. ప్రసాద్ చిత్రంలోనూ నటించబోతున్నాడు.

# సినిమా

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, కృష్ణంరాజు

"జూన్‌లో పాటలు రికార్డు చేస్తాం," అన్నారు నలిని ఆశ్వనీదత్. ఈయన నిర్మించే కొత్త చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజుల సరసన శ్రీదేవి, జయప్రద నాయికలు. సత్యానంద్ మాటలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పంతో కె. రాఘవేంద్రరావు దర్శకుడు.



విశ్వచిత్ర సినీ ఎంటర్ ప్రైజెస్ వారి రెండవ చిత్రంలో జయప్రద, కృష్ణంరాజు

## "మరో పర్ణశాల"

"మే చివరి వారంనుంచి మద్రాసు పరిసరాలలోనే షూటింగ్ ఫిక్సు చేశాం," అన్నారు డైరెక్టర్ రాజాపద్మనాభ (దర్శక నిర్మాత బి. విఠలాచార్య పుత్రుడు). సూర్యోదయా ఆర్ట్ థియేటర్స్ వారి ఈ చిత్రానికి మార్చి 20న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది. శ్రీధర్, నరసింహరాజు, జగ్గయ్య, సత్యనారాయణ వగైరా తారా సందోహం. ఆవుల శ్రీనివాసరావు మాటలు, వేటూరి ప్రభృతులు పాటలు రాస్తున్నారు. ఎస్. రాజేశ్వరరావు సంగీతం, ఆర్. మధుసూదన్ ఛాయ, హనుమంతరావు శిల్పం, కపిల నాగేశ్వరరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. "మూడు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు స్క్రీన్‌ప్లే సమకూర్చి ఈ చిత్రాన్ని నిర్మించే ఎం. కేశవరావు.

*




(గత సంచిక తరువాయి)

## 16

"టక్... టక్..."

"టక్... టక్..."

శరత్‌బాబు పక్కమీద కదిలాడు

మళ్ళీ తలుపు చప్పుడు.

కళ్ళు తెరిచాడు. దుప్పటి లాగేశాడు

మళ్ళీ నిర్విరామంగా తలుపుమీద పెద్ద చప్పుళ్ళు.

పక్కమీదనుంచి లేచాడు.

రెండు చేతులూ ఎత్తి ఒళ్ళు విరుచుకున్నాడు

గది బయట తలుపు బాదుతున్న శబ్దం ఇంకా పెద్దగా వినిపిస్తోంది.

స్విచ్‌బోర్డు దగ్గరకు వచ్చాడు.

బయటినుంచి రెండు చేతులు తలుపులు బద్దలయేలా బాదుతున్నాయి. ఆ శబ్దం చెవులు బద్దలయేలా వినిపిస్తోంది.

స్విచ్ ఆన్ చేశాడు.

ట్యూబులైటు "గప్—చెక్ — గప్- చెక్" అని రెండుసార్లు చప్పుడు చేసి వెలిగింది.

బయట తలుపు కొట్టడం ఆగిపోయింది.

నిశ్శబ్దం!

దూరంగా ఎక్కడో ఇలకోడి కూస్తున్న శబ్దం సన్నగా వినబడుతోంది.

శరత్‌బాబు తలుపులు తీశాడు.

"హల్లో!" తాపీగా నెమ్మదిగా అన్నాడు

"మువ్వా?" అంటూ ఆశ్చర్యపోతాడనుకుంది

కాని చాలా నింపాదిగా -- నిర్లిప్తంగా —

కోల్డ్ బ్లడెడ్ మర్డరర్!

ఆమె గుండెల్లోనుంచి గాలి లాగేసినట్టు అయింది.

బెల్లూను నుంచి గాలి పోతుంటే వినిపించే శబ్దంలాటి శబ్దం ఆమె చెవులకు వినిపిస్తున్నది.

"ఏమిటి? నిద్ర పట్టడంలేదా?" అతని పెదవులమీద మందహాసం కన్పించింది.

అతని ముఖంలోకి రెప్ప వాల్చకుండా చూసింది

"నిద్ర మాత్రలు ఇవ్వమంటారా?" అతని చూపుల్లోని కొంటెతనాన్ని పసికట్టలేనంత తెలివి తక్కువది కాదు ఆమె.

"అవసరం లేదు."

తన గొంతులో స్థైర్యం ఉంది స్పష్టంగానే ఉంది.

"యస్! ఐ కెన్ స్పీక్ నౌ" అనుకుంది సుజాత.

"మీతో మాట్లాడాలి."

"ఈవేళప్పుడా?"

"అవును! ఇప్పుడే మాట్లాడాలి."

అతను వాచీ చూసుకున్నాడు ఒంటిగంట దాటింది

"పోనీయ్ — రేపు ఉదయం మాట్లాడుకో "

"కాదు ఇప్పుడే ఇక్కడే."

"ఓ. కే." కళ్ళెగరేసి, నైట్ గౌను గుండీలు పెట్టుకుంటూ అన్నాడు.

సుజాత హాల్లోకి దారితీసింది

అతడు ఆమెను అనుసరించాడు

సోఫాసెట్ ఉన్న భాగంలోకి వచ్చి లైటు వేసింది ఆమె.

తను సోఫాలో కూర్చుని "కూర్చోండి" అంటూ ఎదురుగా ఉన్న సోఫా చూపించింది సుజాత.

శరత్‌బాబు ఆమె చెప్పినట్టే ఎదురు సోఫాలో కూర్చున్నాడు

"ఊఁ చెప్పండి" అన్నాడు.

**జరిగిన కథ - 11 :** శరత్‌బాబుపై సుజాత పెంచుకొన్న అనుమానాలు వట్టి భ్రమలు మాత్రమేనని రేడియోలో వచ్చిన వార్తల ద్వారా తేలిపోతుంది అయినా ఆమె అనుమానం మాత్రం అలాగే మిగిలిపోతుంది. శరత్‌బాబుకి 'మతి స్థిమితంలేదు' అని శివప్రసాద్ ద్వారా తెలుసుకొన్న సుజాత అతనిపై తన సానుభూతిని వ్యక్తం చేస్తుంది. సుజాత గత స్మృతుల్లోకి జారుకొంటుంది. సుజాతను చూడటానికి శివప్రసాద్ వస్తాడు. శరత్‌బాబు పెళ్ళయిన కొద్దికాలానికే పిచ్చివాడయ్యాడని శివప్రసాద్ చెప్పగా, సుజాత దానికి కారణం అతని భార్యేనని వూహించుకొంటుంది. శరత్ భార్య సునంద తనలాగే ఉంటుందనీ, ఈత నేర్చుకొంటూ నీళ్ళల్లోపడి మరణించిందనీ భర్తద్వారా విన్న సుజాత శరత్తే ఆమెని చంపి వుంటాడని అనుకొంటుంది.

"సునందను ఎందుకు చంపారూ?"

శరత్‌బాబు సోఫాలో ఎగిరిపడ్డాడు.

అతడి ముఖం పాలిపోయింది.

అతడి ముఖంలో మారుతున్న భావాలను రెప్ప వాల్చకుండా చూస్తున్నది సుజాత.

కొద్ది క్షణాలు ఇద్దరిమధ్యా భయంకరమైన నిశ్శబ్దం!

మౌనంగా ఇంటి కప్పుకేసి చూడసాగాడు శరత్

దాన్నే తెవ్వ ఇంటి వాసాలు లెక్కపెట్టడం అంటారు' అనుకొంది సుజాత

ఆ మాట అతని ముఖంమీదే అనాలనిపించింది

ఉన్నట్టుండి అతను హఠాత్తుగా సోఫాలో నుంచి లేచాడు

సుజాతకు గుండెలు చిక్కపట్టినట్టు అయింది బల్లిలా సోఫాకు అంటుకుపోయింది.

"ఫ్యాన్ వెయ్యలేదేం? ఉక్కపోస్తోంది." శరత్ ఫ్యాన్ వేసివచ్చి మళ్ళీ యథాస్థానంలో కూర్చున్నాడు

హమ్మయ్య!

గుండెల నిండుగా గాలి పీల్చుకుంది సుజాత

అయినా అంత పిరికితనం ఏమిటి తనకు?

ఏం చేస్తాడేమిటి?

అంతగా, అవసరం అయితే, ఒక్క కేక పెడితే ఆయన బెడ్‌రూంలో నుంచి ఒక్కంగలో రాడూ?

"అలాగని వాడు — ప్రసాదు చెప్పాడా?" పరిశీలనగా ఆమె ముఖంలోకి చూశాడు.

"ఆయన మీ స్నేహితుడు"

"మీరు నా శత్రువులా?"

అవును—కాదు — అవును—కాదు — అవును! అవును!

"మాట్లాడరేం?" గద్దించినట్టుంది ఆయన గొంతు

సుజాత పళ్ళబిగువుమీద అన్నది—

"అదికాదు నేనవేది. ఆయనగారు మీ స్నేహితుడు. మీరు మీ భార్యను హత్య చేసినట్టు చెబుతాడా? ఒక్కనాటికి అలా చెప్పడు."

"ఓహో! అదా? అయితే నేను నా భార్యను హత్య చేశానని నీకు ఎవరు చెప్పారు?"

"నాకు తెలుసు."

"అదే! ఎలా అని?" అతని కనుబొమలు ముడిపడ్డాయి.

"తెలుసంటే తెలుసు. అంతే! మీరు — సునందను — అదే మీ భార్యను హత్య చేశారు?" కసిగ, ఉసిగా అన్నది.

"చేశాను! అయితే? ఇప్పుడు మీరేం చేస్తారు?" ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు శరత్‌బాబు.

అతని మాటలు ఆమె నెత్తిమీద వడగళ్ళ వర్షం కురిసినట్టు వినిపించాయి.

అతని చూపులు ఆమె మెడమీద జెర్రులు పాకుతున్నట్టు పాకుతున్నాయి.

ఆమెను నిస్సహాయత చుట్టేసింది

ఆ నిస్సహాయతలోనుంచే ఆమెలో కసి పుట్టుకొచ్చింది

ఆమె కళ్ళల్లో ఎర్రజీరలు కన్పించాయి.

"మీ ఫ్రెండు భర్తకు ఫోన్ చెయ్యండి."



మళ్ళీ అతనే తనకు సహాయం అందిస్తున్నాడు.

గోతిలోకి తోసిన వ్యక్తే మళ్ళీ చెయ్యి అందిస్తున్నట్టుగా ఉంది

ఏమిటీ మనిషి ?

నిజంగా పిచ్చివాడేనా ?

అతని ముఖంలోకి చూసింది.

కాని ఆమె చూపులు తేలిపోతున్నాయి

ఒకచోట నిలవడంలేదు.

"మూర్తిగారు నన్ను అరెస్టు చేసి జైల్లో పెట్టిస్తారు. మీ కోరిక అదేగా ?"

"కాదు ఉరి తీయిస్తాడు." ఉక్కిరిబిక్కిరి అయిపోతూ అన్నది.

అతను మెల్లిగా లేచాడు.

కొలుస్తున్నట్టు అడుగులు వేస్తున్నాడు.

సుజాత ఊపిరి బిగబట్టింది.

గాలి పీల్చలేకపోతున్నది.

కొయ్యబొమ్మలా కూర్చుంది.

అతను మెల్లగా అడుగులు వేస్తూ ఫోన్ దగ్గరకు వెళ్ళాడు.

తనకు తెలుసు అతడు ఏం చెయ్యబోతున్నాడో? మొన్న చేసినట్టే ఫోన్ వైర్లు ఊడబీకుతాడు.

"నంబరెంతా ?"

ఉలిక్కిపడింది.

నిజంగానే ఫోన్ చేస్తాడా ?

ఇది మతి తప్పిన మనిషి తప్ప చెయ్యడు. తనకు తానే మతి ఉన్నవాడైతే ఉరితాడులో మెడ దూరుస్తాడా ?

"ఏమిటి నీ ధైర్యం ?"

"నా భార్యను నేను చంపినట్టు నువ్వు రుజువు చెయ్యలేవు గనక."

సుజాతకు తను సోఫాలో కూరుకుపోతున్నట్టయింది. నిరాశ, నిస్పృహ ఆమెను ఆవరించాయి. అయినా క్షణాలమీద ధైర్యం కూడదీసుకుంది.

"నేను రుజువు చేస్తాను."

"ఎలా ?"

"నీకు సునందను పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదు. పెద్దవాళ్ళ బలవంతంమీద చేసుకున్నావ్. పెళ్ళయి మూడు నెలలు తిరక్కముందే ఆమెను వదిలించుకోవాలని చూశావ్. సముద్రంలో ఈత రానంతో ఆమెను తీసుకెళ్ళి ముంచేశావ్"

"అదెవరు చెప్పారు ?"

"ఆయనగారే – మీ స్నేహితుడే చెప్పాడు." విసురుగా అన్నది.

"ఆమెను ఉప్పునీటిలో లేవకుండా తొక్కి తొక్కి..."

"ఇదికూడా మీ శ్రీవారే చెప్పారా ?"

"అవును! ఆయనే చెప్పారు" మొండిగా వత్తి వత్తి అన్నది

"అలా కోర్టులో కూడా చెప్తానని చెప్పాడా ?"

శరత్‌బాబు బిగ్గరగా నవ్వాడు.

ఆమెకు గుండెలు కదబడ్డాయి. నరాలు చిచ్చిపోతున్నాయి.

"నంబరు చెప్పలేదు ఎంత ?" మళ్ళీ అడిగాడు.

"అవసరం లేదు. మీ కెందుకా శ్రమ ? ఏం చెయ్యాలో నాకు తెలుసు. ఆ సంగతేదో నేను చూసుకుంటాను."

"అంతే గద ? అయితే నేను వెళ్ళి పడుకుంటాను."

ఆమె మౌనంగా చూసింది ఏదో ఆలోచిస్తున్నది.

"ఇంకేమైనా మాట్లాడాల్సింది మిగిలిపోయిందా ?" అతని కంఠంలో ధ్వనించిన పరిహాసాన్ని ఆమె గుర్తించకపోలేదు.

"ఉంది."

నేను ఇంతటితో నిన్ను వదులుతానా అన్నట్టుంది ఆమె ధోరణి



ఆమె మెదడులో ఓ మెరుపు మెరిసింది.

"మీ భార్య నిజంగా చచ్చిపోయిందా ?" ఆమె కళ్ళు మిలమిల లాడిపోతున్నాయి

అతడి నెత్తిమీద పిడుగు పడినట్టు అయింది !









కాళ్ళు వశం తప్పాయి.

టెలిఫోన్ పక్కనే స్టూల్‌మీదకు వంగి పోయాడు తనకేసి చూస్తున్న సుజాతను సూటిగ చూడలేకపోయాడు నేల చూపులు చూడసాగాడు.

అలా కుంగిపోతున్న శరత్‌ను చూస్తుంటే ఆమెకు వెయ్యేనుగుల బలం వచ్చినట్టు అయింది ఆమెలో నూరు గుర్రాల వేగం వచ్చింది చిరుతపులి లేడిపిల్లను చూడగానే దూకినట్టు సోఫామీదనుంచి లేచింది. అతడివైపు రెండు అడుగులు వేసింది

"సునంద చనిపోలేదు బతికే ఉంది."

అతడి తల తిరిగిపోయింది.

కళ్ళు చీకట్లుకమ్మాయి

తల విదిలించుకొని ఆమెకేసి చూశాడు

"నువ్వు కాల్చింది నీ భార్య శవాన్ని కాదు గుర్తుపట్టలేని స్థితిలో ఉన్న ఒక ఆడదాని అస్థిపంజరాన్ని పీకి చివికిపోయిన మాంసం ముద్దల్ని అదీ చేపలు తినగా మిగిలినదాన్ని."

అతడి ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు నిలువుగుడ్లు వేశాడు

"నీ భార్య బతికే ఉంది "

ఢమఢమా ఉరుములు.

మెరుపులు !

కిటికీ రెక్కలు కొట్టుకొంటున్నాయి వాటికి ఉన్న తెరలు లేచి అల్లల్లాడుతున్నాయి.

రివ్వున గాలి లోపలకు వచ్చింది

ఆ గాలిలో తేమ — ఆ తేమలో ఏదో అస్పష్టమైన మట్టివాసన — ఆ వాసనలో ఏదో మత్తు — వళ్ళు మొద్దుబారిపోయే మత్తు ..

అతడు లేచి గబగబా కిటికీ రెక్కలు మూయ్యసాగాడు

"ఆగు ! నేను మళ్ళీ వెళ్ళిపోవాలి !"

విద్యుత్ ఘాతం !

వెయ్యి వోల్టుల షాక్ !

వెనక్కు తిరగడానికి ప్రయత్నించాడు.

మెడ తిరగడంలేదు

కాళ్ళు భూమిలోకి దిగబడిపోతున్నాయి.

వెనకనుంచి ఆమె అడుగుల సవ్వడి

"తప్పించుకొని పారిపోవాలని చూస్తున్నావా ?

## మ న సు క థ

నానుంచి నువ్వు పారిపోలేవు చూడు ! తిరిగిచూడు ! నేనెవ్వరినో చూడు "

వీపుమీద చల్లటి చేతులు పాకుతున్నాయి

భుజాలదాకా వచ్చాయి ఆ చేతులు. మెడమీదకు సాగాయి కంఠాన్ని చుట్టుకుపోతున్నాయి

"నేనే ! నేనే ! సునందని."

ఆమె చేతుల్ని వదిలిచుట్టుకొని గిర్రున తిరిగాడు శరత్ ఆమె ముఖంలో ముఖంపెట్టి చూశాడు ఆమె ముఖం చిట్లి రక్తం పొంగుతున్నదా అన్నంతగా జేవురించి ఉంది కళ్ళు జ్యోతుల్లా మండిపోతున్నాయి.

"సుజాతా ! సుజాతా !" అతని కంఠం చర్చి గంటలా మోగింది.

ఆమె కళ్ళముందు భద్రకాళి కంఠ హారంలోని పుర్రెలు తెగిపడ్డాయి !

నాట్యం చేస్తున్న అస్థిపంజరాల కీళ్ళు ఊడి గలగలా రాలిపోతున్నాయి !

ఆమె పెద్దగా కేకపెట్టి అతని చేతుల్లో వాలిపోయింది

### "ప్రవృత్తి"

ఉషస్సు ఉలికి పస్తే ..
తిమిరానికి తీరని వ్యధ —
పరిమళ తైలం తరిగిపోతే
దీపం గుండెలో దిగులు —
మ్రోగే తంత్రులు మొద్దుబారితే .
విపంచి మనసులో విషాదం —
గగనం వర్షించకుంటే . .
గరిక పరకకు ఎంతో గుబులు —
వసంతఋతువు స్పృశించకుంటే
వనవాటిక హృదయంలో వ్యధ —
ప్రక్కింటి కాపురం పచ్చగా ఉంటే
మనుషుల మనసుల్లో ఎంతో మథన —

— వీరవల్లి వీణావాణి

బెడ్ రూం తలుపు తెరుచుకొని శివప్రసాదు పరిగెత్తుకొచ్చాడు

### 17

"రా ! పైకి రా ! రా !"

అతనెటో చూస్తున్నాడు

"ఇటు ఇక్కడ బాదంచెట్టుమీద "

అతను ఆరు అడుగులు రాతి స్తంభంలా నిలబడిపోయాడు

"ఏం ? నన్ను చూస్తే భయంగా ఉందా ?"

అవునన్నట్టు అతను తల ఊపాడు.

"ఛ ! భయమెందుకూ ? నేను నీ భార్యను, సునందను."

"నువ్వు చచ్చిపోయావ్ ?"

"నువ్వు అనుకొంటున్నావ్ ! అంతే ! నేను బతికే ఉన్నాను. నీ కోసమే బతికి ఉన్నాను నీ మీద నాకు మోజు తీరలేదు రా పైకి — రా !"

"అమ్మో నువ్వు దయ్యానివి "

"పిచ్చివాడా! నీకు మతిపోయింది నా కోసమేగా నువ్వు పిచ్చివాడివైనావు అందుకే నీ కోసం మళ్ళీ వచ్చాను నేను దయ్యాన్నికాదు, నీ సునందను "

"అయితే నువ్వు దయ్యంలాగా ఉన్నావెందుకూ ?"

"నిజంగానా ?" నవ్వింది

"అలా నవ్వొద్దు నాకు భయం వేస్తున్నది నువ్వు నిజంగా దెయ్యానివి కాకపోతే బావి దగ్గర బాదం చెట్టుమీద తెల్లచీర కట్టుకొని, జుట్టు విరబోసుకున్నావెందుకూ ? చెట్టుమీద ఎందుకు కూర్చున్నావ్ ?"

"అదా నీ సందేహం ? మా క్రిస్టియన్ పంతులమ్మ తెల్లచీర కట్టుకొని,జుట్టు విరబోసుకొని ఇట్టాగే ఉండేదిగా ?"

"నువ్వు బొట్టెందుకు పెట్టుకోలేదు ? దెయ్యాలు బొట్టు పెట్టుకోవంటగా ?"

"మా పంతులమ్మ కూడా పెట్టుకోదు "

"ఏమో ! నువ్వంటే . "

"నీ దగ్గర కుంకం భరిణి ఉందా ? అయితే ఇటులే ! బొట్టు పెట్టుకుంటాను" ఎగిరి చెట్టు మీదినుంచి దూకింది.




### సి. ఎస్. — కాకినాడ

కొత్త మలుపుపై ఒక పాఠకుడు అడిగిన ప్రశ్నకు వ్యంగ్యంగా జవాబిచ్చారు. మీ విసురుకు రచయిత్రి సమాధానం చెప్పారు. మీకు చాలా నెమ్మదిగా చెప్పారు. మీకు భయపడికాదు, సాటి రచయిత్రి అని సంస్కారం అడ్డువచ్చి ?

★ అడిగిన పాఠకుడికి రచయిత ఎవరో కూడ తెలియకపోయినా మీకు అభ్యంతరంలేదు ! కాని నా సనాతన దృక్పథాన్ని నేను ఒప్పుకుని చెప్పుకుంటే - అది వ్యంగ్యం ! ఏం సమాజం బాబూ యిది ! నేను ఛాందసురాలిని కనుకే పెళ్లికి ముందు ప్రేమించడం దాకానే ఒప్పుకోకలన సెక్సునేనా వివాహం కోసం అట్టేపెట్టుకోకపోతే - యికా పెళ్లికి అర్థం వుండదు ఇక, నిజ జీవితంలో "కన్నె తల్లులు" లేరని నేనెలా అనుకుంటాను ? - "బాల మందిర్" నిండా లుకలుకలాడుతూన్న అనాధసంతతి చూస్తూ కూడా ! అందుకే పెళ్లికి ముందే పక్క పంచుకొందుకు ఆడపిల్లలు కాస్త ముందూ వెనుకా ఆలోచించాలని నా అభిప్రాయం. వయసు తొందర, యౌవ్వనపు జోరు కథల చెప్పకండి . ఇంగితం ముందు యివి బలాదూర్. అమ్మాయిలు కాలు జారాక కష్టం సుఖం తెలుసుకోడం ఎందుకు ? అంతకు ముందే తెలుసుకోవాలని న నమ్మకం ప్రేమ పేర స్వైర విహారం నేను హర్షించలేను అంతే ఇక రచయిత్రి సంస్కారం అన్నారు ఇదిగో ఆ సంస్కారానికి నా జోహార్లు !

### ఎల్. ఎస్. ఆర్. — భువనేశ్వర్

చదవడానికెందుకు తీరిక ? అంత మించిన మిత్రులు లేరిక అన్నారు ఆరుద్రగారు ?

★ అంటారంటారు ! హాయిగా పుస్తకాల గూట్లో కూర్చునే మనిషి యింకేమంటారు !!

### మధు — కొటాల

మనసెరిగి మనసిచ్చే మగువ నా జీవితంలోకి రావాలని ఆశిస్తున్నాను ?

★ పెళ్లికి అర్థం అదే కదా ?!

కులాంతర మతాంతర వివాహం చేసుకోవాలని వుంది మీకు తెలిసిన ఎవరైనా అందమైన అమ్మాయి వుంటే .

★ ఎందుకుండరూ ? కో అంటే కోటిమంది వుంటారు ! ఇంతకీ పెళ్లికి ముందేనా - కులం, మతం, జాతకం, కావాలిగా — మీ వాళ్లకోసం (పాపం మీ కోసం కాదు)

### శేఖర్ — ఉరవకొండ

మనస్తత్వాలు అర్థంకానప్పుడు అనుక్షణం అర్థంలేని అపోహలతో జీవితం నరకం అని తెలిసిననాడు ఆమె కర్తవ్యం ఏమిటి ?

★ అంతా తెలిసిపోయాక కర్తవ్యం ఒక్కటేనా తెలియదు ?! చూడండి ఒకరి నొకరు అర్థం చేసుకోవాలంటే -- అనుక్షణం ఆ ప్రయత్నం చేస్తూ సాగాలి, అపోహలు పెంచుకుంటూ కాదు.

### వి. ఏ. ఎల్. ఎస్. ఆర్. — మధిర

నాకు వచ్చిన జీతం అంతా ప్రతినెలా వస్తువ మా ఆవిడ చేతిలో పోస్తా నాకు అవసరమైనప్పుడు అడిగి తీసుకుంటాను ఇంటి బాధ్యత లేవి పట్టించుకోను నెలలో పదిహేనురోజులు గడిచేసరికి జీతం అంతా అయిపోతుంది ఇక ఉపవాసాలు ఉప్మా, చపాతీలు చేస్తుంది ..

★ పొరపాటు మీ దంపతులిద్దరిదీను ! పదిహేనురోజులు పండుగ, పదిహేనురోజుల ఉపవాసం కాదు చేయవలసింది! రాబడినిపట్టి ఖర్చులు ప్లాను చేసుకోవాలి ఆ తినే ఉప్మా, చపాతీలు — రోజూ రాత్రి తింటే ఆరోగ్యం నెల సామాన్లు ఏకంగా ఒకేసారి తెచ్చుకోడం; కావలసినంతే వండుకోవడం, దినసరి ఖర్చులు రాయడం, దేనికి అనవసరంగా కర్చవుతోందో తెలుసుక నే ప్రయత్నాలు చేయుడం — ఒక పద్ధతి దినదిన గండంగా గడిపేయడం యింకో పద్ధతి ఏది మంచిమార్గమో ఆలోచించుకోండి. తమిళులైతే ఏం చేస్తారో తెలుసా ? ముందు వచ్చిన జీతంలోంచి ఓ పాతికో పరకో తమది కాదని సేవింగ్సులో పడేస్తారు మిగిలిన దాంతో గడుపుతారు చేబదుళ్లు చేసేనా గడుపుతారుగాని, సేవింగ్స్ కదపరు ! ఉన్న రాబడి- అర్థవంతంగా ఖర్చుచేసి, అప్పులపాలు కాకుండా వుంటే అదే చాలునని అనుకుంటాం మనం ! అదీ వాళ్లకీ మనకీ తేడా ఇంటి కర్చులు ప్లాను చేయమనండి మీ శ్రీమతిని. మీ కనవసరం అనిపించినవి చూసి కస్సుమనకండి మధ్యేమార్గం వుందా అని ఆలోచించండి

### యు. ఎస్. కె. — నరసరావుపేట

రచయితకు కావలసినది ఏమిటి ?

★ పంపిన తొలి రచన అచ్చు అయేదాకా ఓర్పు ★

---

"ఇట్లారా బావి ఒడ్డున కూర్చుందాం" చెయ్యి పట్టుకొని నడుస్తున్నది

"నా మీద నీకు ప్రేమలేదు కదూ ? నిజం చెప్పు !"

"నిన్ను ప్రేమిస్తున్నాను మనసారా ప్రేమిస్తున్నాను" అంటూ అతను ఆమెను ఒడిసి పట్టుకున్నాడు.

మెల్లగా, మెల్లమెల్లగా, వళ్ళంతా అతని చేతులే — అలా అలా బావి ఒడ్డుకు తీసుకొచ్చాడు ఒక్కసారిగా అమాంతం బావిలోకి తోశాడు

"అమ్మా ! అమ్మా !"

* * *

"సుజాతా ! సుజాతా !" ఎవరో ఆమెను తట్టి లేపుతున్నారు.

ఆమె కళ్ళు తెరిచింది. అమాంతం పక్కమీద లేచి కూర్చుంది.

"ఏమైంది ? ఏమైంది సుజా ?" శివప్రసాద్ భార్యను పట్టుకొని కుదిపి కుదిపి అడుగుతున్నాడు

"పాడు కల ! పీడకలండీ !" వణికిపోతూ అన్నది సుజాత.

"కలేగా ? అయిపోయిందిగా ? ఇంకెందుకు భయం ? ఉండు !"

## మ న సు క ధ

శివప్రసాద్ డైనింగ్ హాల్లోకి వెళ్ళి, ఫ్రిజ్ తెరిచి మంచినీళ్ళ సీసా, గ్లాసూ తీసుకొని రెండు నిముషాల్లో తిరిగొచ్చాడు.

గ్లాసులో నీళ్ళు పోసి అందించాడు గ్లాసెడు నీళ్లూ గట గట తాగి, భర్త చేతిలోని సీసా తీసుకున్నది బాటిల్ వంచి అరచేతిలో నీళ్ల వంపుకుంది ముఖంమీద చల్లుకుంది

మనిషి స్థిమితపడింది

తేలిగ్గా గాలి పీల్చుకుంది

"ఏమిటో పిచ్చికలండీ !" తనకు తనే చెప్పుకుంటున్నట్టు అన్నది

"ఏమిటా కల ?" ఉత్కంఠతో అడిగాడు భర్త.

"నన్ను శరత్‌బాబు బావిలోకి తోసేశాడు నేనేమో తెల్లచీర కట్టుకొని మా ఊరి పంతులమ్మ లాగ..."

"పంతులమ్మా ? ఎవరామె ?" కుతూహలంగా అడిగాడు శివప్రసాదు

"నా చిన్నప్పుడు మా ఇంటి పక్క ఓ క్రిస్టియన్ పంతులమ్మ ఉండేది. ఎప్పుడూ మా ఇంటికి వస్తుండేది "

"ఆఁ వచ్చి ?"

"బాగా చిన్నప్పుడండీ ?"

"అప్పుడు నీ కెంత వయసుండేది ?"

"బాగా చిన్నప్పుడు — సరిగా గుర్తురావడం లేదు "

"ఫర్ గెట్ ఇట్ డోంట్ బాదర్! పడుకో!" అనునయంగా అన్నాడు ఆమె భర్త.

భర్త దగ్గరగా జరిగింది

అతని ఛాతీమీదగా చెయ్యివేసి, పసిపిల్లలా ముడుచుకొని పడుకుంది సుజాత

"అసలు నేనే అతడ్ని బావిలోకి తోసేద్దామనుకున్నా కాని అతడే నన్ను తోసేశాడండీ !" పసిపిల్లలా మాట్లాడినట్టుంది

"ఊఁ ఎవ్వడూ ?"

"అదేనండీ కలలో !"

హాల్లో మంచి గోడగడియారం గంటలు కొడుతుంది ఐదు గంటలు కొట్టింది.

"తెల్లవారుఝామున వచ్చే కలలు నిజం అవుతాయంటారు నిజమేనా ?"

"కలలో జరిగింది ఇలలో జరగదని అంటారు" పసిబిడ్డను బుజ్జగిస్తున్నట్టుగా అన్నాడు

(ఇంకా వుంది)

# మీ జీవితంలో ఎంతో కష్టపడ పైకి వచ్చారు మీరు.

## అందుకే మేము మీ కోసమే డిజైను చేశాం ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటి అతిసులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్ క్రొత్త బిఎస్ఎ డీలక్స్.



బిఎస్ఎ డీలక్స్ యొక్క సొగసైన సన్నటి బ్యారల్డ్ హబ్ ఇవి అత్యంత నాణ్యమైన దృఢమైన కేస్ కప్స్ కలిగి సైకిల్ మెత్తగా, హాయిగా నడిచేలా చేస్తాయి



ఎక్కువ సులభంగా తిరగడానికి వీలునిచ్చే చక్కటి గొట్టపు ఫోర్క్ దీనితో బిఎస్ఎ డీలక్స్ తొక్కడం నిజంగా సుఖకరం



మీ వీపు మరియు పాదాలకు తక్కువ కష్టం కల్గించి ఎక్కువ హాయి నివ్వడానికై బిఎస్ఎ డీలక్స్ ఫ్రేము యొక్క కోణం ప్రత్యేకంగ డిజైను చేయబడినది



మీరు జీవితంలో ఎంతో దూరం వచ్చారు ఎంతో కష్టపడి మరీ పైకి వచ్చారు అందుకే మీకు కావాలి అత్యుత్తమమైనది అదే బిఎస్ఎ డీలక్స్ మీరు పనికి వెళ్ళడానికోసం ప్రత్యేకంగా డిజైను చేయబడి అతి సులభంగా, హాయిగా తొక్కగలిగే సైకిల్ ఇదివరకు మీరెన్నడూ తొక్కనటువంటిది ఇంతకుముందు ఎన్నో ఇతర సైకిళ్ళను తొక్కివుంటారు మీరు అందుకే వ్యత్యాసం స్పష్టంగా అనుభవించగలరు మీ పాదాలు, మీ చేతులు, మీ వీపు మీ శరీరపు ప్రతి భాగం చెపుతుంది ఇంత సులభమైన, సుఖకరమైన సైకిల్‌ను మీరు ఇదివరకు ఎప్పుడూ తొక్కలేదని

పచ్చ మరియు నలుపు రంగులలో లభ్యం



## క్రొత్త బిఎస్ఎ డీలక్స్ - సఫలత-మార్గంలో మీకు సుఖకరమైన తోడు.

Rediffusion-TI-1911 TL

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## విద్యార్థిలోకం వ్యాసరచన పోటీ!

# మొత్తం బహుమతులు రు. 6000 !

మొదటి బహుమతి రు. 1000

రెండవ బహుమతి రు. 750

మూడవ బహుమతి రు. 500

గడువు తేదీ

**31-5-1982**

ఇవికాక రు. 150 చొప్పున 25 ప్రత్యేక బహుమతులు!

# మా విద్యార్థిలోకం ఆశయాలు

ప్రపంచం అన్ని విధాలుగానూ మారిపోతున్న ఈ కాలంలో విద్యార్థి లోకం సమస్యలు ఇన్నీ అన్నీ కావు! వారి ఆశయాలకీ యదార్థాలకి కుదరటం కష్టం అయిపోతోందని అందరూ అంగీకరిస్తున్నారు.

తమ సమస్యలని గురించి చెప్పే హక్కు విద్యార్థినులకి, విద్యార్థులకీ కాక ఇంకెవరికి ఉంటుంది? అసలు విద్యార్థి లోకం సమస్యలు ఇతరుల సమస్యలే అంటే కూడా అతిశయోక్తి కాకపోవచ్చు!

అందుకనే విద్యార్థినులూ, విద్యార్థులూ తమ ఆశయాలనీ, ఆ ఆశయాలకి అవరోధాలుగా నిలిచే సమస్యలనీ, ఆ సమస్యల పరిష్కారానికి తగిన మార్గాలనీ గురించి సాభిప్రాయంగా రాసేందుకు అవకాశాలు కల్పించాలనే ఉద్దేశంతో ఆంధ్రసచిత్రవారపత్రికలో ఒక విద్యార్థి లోకం వ్యాస రచన పోటీ ఏర్పాటు చేస్తున్నాము!

ఈ వ్యాస రచన పోటీ ఒక మంచి చర్చావేదికగా రూపొంది విద్యార్థి లోకంలోనూ, ఇతరులలోనూ ఆలోచనలని రేకెత్తించగలిగేట్లుగా ఉండగలదని ఆశిస్తున్నాము!

విద్యార్థినులూ, విద్యార్థులూ ఈ వ్యాస రచన పోటీలో ఉత్సాహంతో పాలుగొని దానిని జయప్రదం చెయ్యాలని మా కోరిక!

## నిబంధనలు:

1. ఈ వ్యాస రచన పోటీలో విద్యార్థినులూ, విద్యార్థులూ మాత్రమే పాలుగొనవచ్చు. ఇతరులు పాలుగొనరాదు.
2. వ్యాసాలు రెండు అరఠావు పేజీలని మించి ఉండరాదు ఒక అరఠావు పేజీ రెండు ఎక్సర్సయిజు నోట్ బుక్ పేజీలతో సమానం.
3. రచన కాగితానికి ఒక పక్కనే పూర్తిగా తెలుగు లిపిలో రాసినవయి ఉండాలి.
4. ప్రతి వ్రాతప్రతిమీదా రాసినవారి పేరూ, పూర్తి చిరునామా కూడా రాసి ఉండాలి. వేరే చీటీలమీద పేరూ, చిరునామా రాసి వాటిని వ్రాత ప్రతులతో జతపరచరాదు.
5. రచన పెట్టిపంపే కవరుమీద "విద్యార్థి లోకం వ్యాస రచన పోటీకి" అని స్పష్టంగా రాసి ఉండాలి
6. వ్యాసాలు పంపవలిసిన పేరు, చిరునామా :

**సంపాదకుడు,**

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**శ్రీ దుర్గావిలాస్**

**గాంధీనగర్**

**విజయవాడ – 520 003.**

వ్యక్తుల పేర పంపరాదు.

7. వ్రాత ప్రతులు ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పిపంపబడవు రచయిత(త్రు)లు స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజీకల కవరులుకాని తపాలా బిళ్ళలుకాని జతపరచరాదని మనవి
8. ప్రతి వ్యాసంతోనూ ఈ ప్రకటనలో పొందుపరిచిన 'కూపన్' జతపరచాలి. కూపన్ జతపరచబడని రచనలు పోటీకి పరిశీలింపబడవు.
9. వ్యాసాలు మా కార్యాలయానికి 31–5–82 నాడుగాని అంతకు ముందుగాని అందాలి ఆ తరువాత అందినవి పోటీకి పరిశీలింపబడవు.
10. పోటీ ఫలితాలు జూలై (నెల)లో ప్రచురించటానికి ప్రయత్నిస్తాము.
11. పోటీలో తుది నిర్ణయం సంపాదకునిదే. దీని విషయములో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
12. ప్రతి వ్రాతప్రతిమీద రచయిత (త్రి) రచన తమ స్వంతమేనని తెలిపే హామీ ఇవ్వాలి
13. వీలువిబట్టి పోటీలో గెలిచిన వ్యాసాలని ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురిస్తాము

**కూపన్**

| | |
|---|---|
| పేరు | |
| వయసు | తరగతి |
| ఇంటి నెం. | వీధి |
| పేట | ఊరు. |
| పిన్ కోడ్ | |

# అద్దం



## వి.వి.బి. రామారావు

"మేడమ్ వస్తున్నారు!"

ఆ వరండా చివర కెమిస్ట్రీ మేడమ్ కనపడే సరికి ఆరు రూమ్‌ల తరువాత ఉన్న రూమ్ నెంబర్ సెవెన్‌లో అమ్మాయిల కలకలం సద్దుమణిగింది

"ఆడపిల్లలు కారూ! సిగ్గుంచుకోనక్కర్లేదూ?"

ప్లాట్‌ఫారమ్ మీదకు వస్తున్న ఇంజన్ బోయ్‌న కూసింది.

"ఎవరు నువ్? వరండామీద ఎందుకున్నావ్? అంత పరిగెత్తేదానివి కారిడర్‌లో ఏమని పెత్తనాలు చేస్తున్నావ్?"

ఆర్గండీ చీర గలగలలు దగ్గరకొస్తున్నయ్.

"ఆ ఇంటర్ సెకెండ్ ఇయర్ ప్రాక్టికల్ సెట్స్‌హా.. నేనొచ్చి చూస్తా. చూడు గురువులూ. వీడిమీద ఆధారపడి లాభంలేదు నువ్వే అన్నీ చూసుకో.. వాళ్ళెవరో వస్తున్నారట కూడా! రేపటినుంచి పరీక్షలు... నువ్ నాతో చెప్పకుండా అటూ, ఇటూ వెళ్లిపోవద్దు"

మేడమ్ క్లాసులోకి వెళ్ళిపోయారు

"ఒరేయ్ అప్పలకొండా! నువ్ బేగెల్లి ఆ గది సర్ది!.. అమ్మగోరు కోపంగున్నారు. ఆల్లెవులో ఒస్తారంట. ఆ యమ్మలో ఇవి పెద్దసిక్కు. ఉంచిన వస్తువు వుంచినట్టుంచరు గదా. నువ్వెళ్ళు.. నేనూ ఎనకాలే వొచ్చి నే జూసుకుంటాన్లేరా.. నువ్ పదముందు. ఆళ్లెవులో మనకేలగాపి తల్దించుకుపోవాల.." ముసలి ఎటెండర్ కొడుక్కి అమ్మగారి 'శెలవు' నందజేశాడు

ఈ మాటలన్నీ వింటూనే ఉంది క్లాసులో కూమన్న సుందరి. మేడమ్ క్లాసులోకి అడుగు పెట్టేసరికి బలవంతాన కళ్ళు తెరిచి నుంచుంది మళ్ళీ కూచోగానే కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

ఆదరాబాదరా నాలుగు మెతుకులు తిని వెనకాతలా ముందూ ఈ తరపు వందిమాగధులు ఈలలూ, జోక్స్ వేస్తుండగా, గుండె దడదడలాడుతూ ఉంటే పరుగులాంటి నడకతో కాలేజీ ఆవరణచేరి. మేడ మెట్లెక్కి ఏడో గది చేరుకునే సరికి బోల్డు ఆయాసం ... మనసుకి నీరసం . .

క్లాసులో మేడమ్ వచ్చేసరికి ఆవులింతలు .. నిద్ర

ఆర్ట్స్ చదువుకోడంలో ఓ హాయి ఉంది. ఎంచక్కా నిద్రపోతూ ఉండవచ్చు. సైన్స్ ప్రాక్టికల్‌లో నుంచోవలసి ఉండడం మూలాన్న నిద్ర సాధ్యంకాదు. ఒకవేళ సాధనవల్ల దానిని చేకూర్చుకుందామన్నా మేడమ్ పాఠం చెప్పేటీరు ఎలా ఉన్నా చుట్టూ తిరుగుతూ ఉండడం చాలా ఇబ్బందిని కలిగిస్తుంది.

జడలో పూవులో, మేచింగు గాజులో – కొత్త చీరో, కొత్త చెప్పులో రంగులవీ, చుక్కలవీ .. అవి ... ఎన్ని వీలయితే అన్నీ అందరికీ చూపించాలన్న ఆకాంక్ష ఆవిడ ప్రతి కదలికలో, శరీరంలో ప్రతి అందంలో కనపడుతుంది సుందరికి.

సుందరి కళ్లలో ఓ ప్రత్యేకత ఉంది. ఎక్స్‌రేకి కూడా లేని ప్రత్యేకత అది. ఎక్స్‌రే ఎందులో నుంచైనా చొచ్చుకుపోగలవు – ఒక్క సీసంలోనుంచి తప్ప.

సుందరి కళ్ళు ఎవరి కళ్ళలోనుంచైనా దూసుకు

పొగలవు - ఒక్క ఎదురింటివాళ్ల మేనల్లుడు సుధాకర్ కళ్లలోనుంచి తప్ప సుందరి కళ్లు కొన్నింటికి అద్దం పట్టగలవ్. తన ఎదుటివారు దేని గురించి ఆలోచిస్తున్నారో వారివంక తదేకంగా చూస్తే చెప్పేయగలదు తన దగ్గర ఈ అద్దం ఉన్న సంగతి ఎవరికీ తెలియనివ్వదు సుందరి కాని ఒక్క ఎక్సెప్షన్ ఉంది సుందరి శక్తికి అదే సుధాకర్ మనసు. అతనయితే కిటికీలోనుంచీ తనివితీరా తనని చూసేస్తాడు కాని తన కళ్లలోకి సుందరి కళ్లు పడకుండా జాగ్రత్త తీసుకుంటాడు

సుందరి కళ్లు ఏ కళ్లలోకి చూసినా, నిదానంగా చూస్తే చాలు అవతల వ్యక్తి మస్తిష్కంలోని ఆలోచనలన్నిటికీ ఆటోమేటిక్‌గా అద్దంపట్టేస్తుంది.

ఈ అద్దంలోకే చూస్తోంది సుందరి టీచర్ కళ్లగుండా.

"పెర్‌ఫెక్ట్ మ్యాచింగ్! ఈ అమ్మాయికి మంచి అభిరుచి ఉంది ఫ్యాషనంటే ఏ అమ్మాయికి తెలుసు ..."

తనవంక చూస్తున్న మేడమ్ మనసులో ఇదీ -లోచనని సుందరికి తన అద్దం చెబుతోంది

లెక్చరు సాగిపోతోంది

"పరీక్షలొచ్చేశాయి నేను చెప్పిన నోట్సు జాగ్రత్తగా చదువుకుంటే చాలు. క్లాసులకిరెగ్యులర్‌గా వచ్చి నోట్సు రాసుకున్నవాళ్లకేం కష్టం ఉండదు పరీక్షలకి బాగా చదివారనుకుంటాను ఎలా చదివావ్ రజనీ? నువ్ చదువుతావ్‌లే నాకు తెలుసు నీ సంగతేమిటి హేమంతా? రోజూ శ్రద్ధగా క్లాసులకి వచ్చేవాళ్లు మీరు."

ఈ చీరకీ బ్లవుజుకీ, గాజులకీ, పూసలకీ మ్యాచింగ్...దీని దగ్గరకువెళ్లి .దాని ముఖం చూసి తెలుసుకోవాలి

సుందరికి అద్దం చెబుతోంది

మేడమ్ దగ్గరకు వచ్చేశారు. "ఎలా చదువుతున్నావ్? ఏదీ నోట్సు చూద్దాం!"

"లేదు మేడమ్ .. ఎదురింటి గౌరి తీసుకువెళ్లింది. వాళ్లింటికి వెళ్లి అడగడమంటే .."

"షటప్! నేను అడిగిన దేమిటి, నువ్వు చెబుతున్నదేమిటి?"

ఆ వేలు చూపడంలో బృహన్నల వేషంలో - ఎప్పటిదో పాత సినిమా—ఎన్ టి ఆర్. గుర్తొచ్చాడు సుందరికి.

ఆ వేలు వెళ్లి గుండెమీద వేలాడుతున్న సుదీర్ఘమైన గొలుసును మెలిపెడుతూ ఆడుంకుటోంది.

"సారీ మేడమ్!"

సుందరి గొంతులో 'దుఃఖం'.

ఒక మనిషిని చూసి దుఃఖపడడం అంటే అసూయపడడం అన్న అర్థమూ ఉంది వాడుకలో.

నాకంటె ఆవిడ ఏమంత 'పెద్దది' కనక! మహా అయితే మూడేళ్లు! నాకేం -- మహారాణిని. అదికదూ ఆవిడ పొగరు... పొత్రం. . నాకేకదా పెళ్లయిపోయింది.. నాకేకదా... బ్యాంకులో కూచుని సిగరెట్లు తగలేస్తూ సంతకాలు బరుకుతున్నందుకు రెండు వేల జీతగాడు భర్త. . నన్నేకదా వెతికి వెతికి ఇల్లు తెలుసుకుని ఉద్యోగమిచ్చారు! నాకేకదా.. దోసకాయలాంటి మగబిడ్డ. . పిల్లల మీద కస్సుబుస్సులాడుతూ పాఠాలు చదువుతున్నందుకు నెలకు వెయ్యిన్నర జీతం. .

అంత దుఃఖంలోనూ సుందరి కళ్లెత్తి మేడమ్ గుండెమీదకు, ఆ తరువాత కళ్లలోకి చూసింది.

మేడమ్ లెక్చర్ అందుకుంది.

"కొంతమందికి ఎంత చెప్పినా అర్థమయి చావదు మీ మేలు కోరే ఇం. త శ్రమ తీసుకుని చెబుతున్నా శ్రద్ధలేని చదువు శుద్ధ వ్యర్థం... కేవలం పెద్దవాళ్ల కోసమో, వరాన్వేషణ కోసమో .. డబ్బు కోసమో . ఊసుపోకా, ఫ్యాషన్ కోసమో చదవకూడదు . స్త్రీ లోకం ముందంజ వెయ్యాలంటే ఒకే ఒక మార్గం. నిరంతర కృషి .. కఠిన దీక్ష. . జన్మతః మనకి పురుషుడికి లేని బాధ్యత ప్రకృతి మన శరీరాన్ని వేసింది.. సుందరీ నీమీద నాకు కోపం లేదు. నిన్ను నేను చాలా రోజుల నుంచి చూస్తున్నాను. ఎప్పుడూ ఏదో లోకంలో ఉంటావ్! ఆ లోకం విషయం నా కనవసరం అనుకో. "

సుందరి అద్దంలో ఆ 'లోకం'లో కన్నెపిల్లగా మేడమ్ కన్న కలలు ఒక తృటి ప్రతిబింబించాయి.

—అతను తన గురించి ఏమనుకుంటున్నాడో . ఉద్యోగం మంచిదే... అత్తగారూ ఆడబిడ్డా, బాదరాబందీ లేవు.. అబ్బాయి గుండ్రంగా, వెడల్పుగా.. పొడుగ్గా ఉన్నాడు. ఇక ఫ్యాషన్ విషయమా... తన చేతికిందకు వస్తే ఎంతసేపు నెల రోజుల్లో మార్చెయ్యవచ్చు. సిగరెట్లు కాల్చక పోతేనేం . ఫరవాలేదు సర్దుకోవచ్చు ..

"కష్టపడి చదవాలి.. మంచి మార్కులు తెచ్చుకోవాలి... మనకి కావలసినవి మనం సంపాయించుకోవాలి మన కాళ్లమీద మనం నుంచోవాలి అప్పుడే మనకి సంఘంలో సరైన స్థానం ."

సుందరి ఆవిడ పెదవులవంక కాకుండా కళ్లలోకి చూసింది అద్దం మిలమిల మెరిసింది ట్యూబ్‌లైట్‌లా టిక్‌టిక్‌లాడి భళ్లున వెలిగింది.

—ఇంటిదగ్గర సెలవ్ పెట్టి కూచున్నారు ఏం చేస్తున్నారో ఏమో! ఆ ఎదురింటి అమ్మాయికి జన్మలో పెళ్లి కాదు ఆ కిటికీ వదలదు. పైగా కర్టెనెందుకో అలా ఈయనవంక అసలు మగాడినెప్పుడూ చూడనట్టు. సిగ్గూ లజ్జా లేకుండా కళ్లతోనే తాగేస్తూ ఉంటుంది ఈయనకు అంతకంటె బుద్ధిలేదు వీధి గుమ్మానికెదురుగా సావిట్లో కుర్చీ వేసుకు కూర్చుని దాని కళ్లలోకి చూస్తూ చంటాడిని ముద్దులాడటంలో అంతర్యం? దానికి ఈనరికి అర్థమయ్యే ఉంటుంది ఈ పనుల కెంతసేపు కావాలి! వెధవ క్లాసు. రేపు పరీక్షంటే ఇవాళవరకూ ఏం చెప్పడం . ఇక్కడ ఉండక పోతేనేం . ఇకమీదట ఆయన ఒంటరిగా శెలవ్ పెట్టడానికి వీల్లేదు

అద్దం చెబుతోంది

"రేపు ప్రాక్టికల్ పరీక్ష. ఇదే ఈ సంవత్సరానికి ఆఖరి క్లాసు బాగా చదివినవాళ్లు చదవనే చదివారు. చదవనివాళ్లకూడా ఈ సంవత్సరం మొదటినుంచి చేసిన ప్రాక్టికల్ నోట్సు, అవి చూసుకోండి. మీకేం డవుటున్నా వెంటనే నా దగ్గరకు రండి ఏ వేళప్పుడైనా సరే..."

—ఇల్లు సర్దుకుని. .వచ్చినవాళ్ళకు తన భర్తనీ, బిడ్డనీ పరిచయం చెయ్యాలి. పనిపిల్ల ఇంటిలో ఉన్నవేళ వస్తే వచ్చినవాళ్లకి ఇంత కాఫీయో, డ్రింకో... పిల్లలను మంచి చేసుకోడానికి ఇదే బెస్ట్

సుందరి ఆమె కళ్లలోనే చూస్తోంది

ఎవరో లేచి ఏదో ప్రశ్న వేశారు

"అలా లేచి అడిగేవాళ్లంటే నాకెంతో ఇష్టం!"

మేడమ్ జవాబు చెబుతూ బుట్టబొమ్మలా తిప్పుకుంటోంది. ఈ నాట్యానికి ఏం పేరు? కథాకళీయా? కూచిపూడా? ఒడిస్సీయా? భరత నాట్యమా? కాదు, సంప్రదాయ సిద్ధమైనదేదీకాదు ఇదో రకం డిస్కో

సుందరి కళ్లు పక్కకు తిప్పుకుని, మనసుని తిట్టుకుని అద్దం మడిచేసింది

జవాబు శ్రద్ధగా వింటోంది

క్లాసయిపోయింది.

మరునటిరోజు ప్రాక్టికల్ పరీక్షకి ఓ అరగంట ముందే కాలేజీకి వెళ్లింది, కెమిస్ట్రీ ఎటెండర్‌ను కాస్త చెంచాగిరీ చెయ్యడానికి

పర్సులో పది కాగితం తీసి ఇచ్చింది.

ఎగ్జామినర్‌ను నడిపించుకుంటూ మేడమ్ ప్రాక్టికల్ జరగాల్సిన లేబరేటరీలోకి వచ్చింది

దేశాన్ని పరిపాలించే రాణి వస్తుంటే చెవో

## వృద్ధాప్యానికి కారణం?

వృద్ధాప్యానికి కారణాలేమిటి? వృద్ధాప్యం కలుగడంలో సంభవించే జీవశాస్త్ర మార్పులేమిటి? ఈమార్పులను అదుపుచేయకలిగితే వృద్ధాప్యం రాకుండా వుంటుందా? ఇవి కేవలం ప్రశ్నలే? వీటికి సమగ్రమైన సమాధానాలు లభించాలంటేఇంకా కొంతకాలం వేచి యుండాలి. ప్రస్తుతం లభిస్తున్న వివరాల ప్రకారం వృద్ధాప్యం ఏర్పడటంలో మెదడు ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తుంది.సుమారు 60 సంవత్సరాల వయస్సులో మెదడు, ముఖ్యంగా వెలుపలి బూడిద రంగుపొర, ముడుచుకుకోవడం ప్రారంభమౌతుంది అయితే మెదడులోని అన్నిభాగాలకు వృద్ధాప్యం రాదు ఉదాహరణకు జ్ఞానేంద్రియాలకు సంబంధించిన భాగాలకు వృద్ధాప్యం రాదు. కానీ, క్రొత్త ఆలోచనలను అమలుపరిచే భాగాలకు 60–65 సంవత్సరాల మధ్య వృద్ధాప్యం వస్తుంది. కేవలం యీ వివరాలు వృద్ధాప్యాన్ని నివారించటానికి తోడ్పడవు అయితే వృద్ధాప్యం చెందుతున్న మెదడును వీలయినంత చురుకుగావుంచటానికి ప్రయత్నించాలని పశ్చిమ జర్మనీకి చెందిన ప్రొ. హాగ్ యిటీవల ఒక వైద్య సమావేశంలో తెలియచేశారు.




పక్కా అలగా జనం తప్పుకున్నట్టు విద్యార్థినులు ఇటూ అటూ తప్పుకుని తోవ ఇచ్చేశారు.

సిగరెట్టు కాలుస్తున్న ఎగ్జామినర్ ఒక్కక్షణం ఆగి ఒక్కసారి సిగరెట్టు పీల్చి వరండా చివరకొచ్చి లాఘవంగా రెండు వేళ్లతో సిగరెట్టును విసిరేశాడు

' ఈ అమ్మాయి చాలా అందంగా ఉందే !''

ఆయన కళ్లలోకి చూసిన సుందరికి తన అద్దం చెబుతోంది

''వీళ్లకి ఎంత చెప్పినా ఇంతేసార్ ! క్లాసులకి సరిగా వస్తే కదా ! లేదు మార్చడానికి వీళ్లేదు వచ్చిన నంబరు తీసుకోవాల్సిందే ఏం తెలిస్తే అదే చెయ్యి నువ్ క్లాసుకి రాకపోడం మా తప్పా ? యూ గో !''

ప్రాక్టికల్ ప్రాబ్లెం తీసుకుని ముందుకు వెళ్లిపోయింది సుందరి ముందున్న అమ్మాయి.

సుందరి ఎగ్జామినర్‌కు ఎదురుగా వచ్చి నుంచుంది

''ఇదీ అల్లాంటి కేసే ! ఏమిటలా చూస్తావ్! ఏదో ఓ చీటీ తీసుకో !'' మేడమ్ గదమాయించింది

తన చేతికొచ్చిన నంబర్ తీసుకుని వర్క్ టేబిల్ వంక వెళుతూ సుందరి వెనక్కి తిరిగి చూసింది — ఎగ్జామినర్ వంకా, మేడమ్ వంకా

—భలే అందమైన పిల్ల ఎవరో ఆ అదృష్టవంతుడు ?

—చీర చూడు, ఎంత సింగారంగా కట్టిందో ఏ సినిమా స్టారు చాలదు వీళ్ల ఫ్యాషన్లకి

అద్దం గట్టిగా మడిచేసి మిక్స్చర్ ఎనాలిసిస్‌లో మునిగిపోయింది, సుందరి.

ఎటెండర్లు అటూ ఇటూ బిజీగా తిరుగుతున్నారు

''మాష్టారికి టిఫిన్ కాఫీ తీసుకురావడానికి ఎవరు వెళుతున్నారు ?'' మేడమ్ అడిగారు

''మా యయ్యను పంపుతా !''

''మీ అయ్యేం తెస్తాడు ! నువ్ వెళ్లు మీ అయ్యను ఇక్కడే ఉండమను నువ్వయితే సైకిలు మీద తొందరగా వస్తావ్ ! అయనను అడిగి ఏది కావాలో అది స్పెషల్‌గా చేయించి తీసుకురా ''

మేడమ్ వంక చూసింది సుందరి

# అద్దం

—ఈ వెధవ వాళ్ల దగ్గర ఐదూ పదీ తీసుకుని పరీక్షలో ఏదో సాయం చేస్తానంటాడు. వీడిని ఇక్కడ నుంచి కాసేపు తరిమేస్తే

సుందరి కళ్లు దించుకుంది.

కుర్ర ఎటెండర్ వెళ్లిపోయాడు

ఎంత ఆలోచించినా, బుర్రబద్దలుకొంటున్నా రాడికల్స్ ఏమిటో తెలియడంలేదు.

రెండుగంటలు ఖర్చయిపోయాయి పేపరుమీద ఒక్క వాక్యం రాయడం జరగలేదు పరీక్ష పోవడం ఖాయం నైట్ కంటిన్యూచేసి మరీ చూసుకోవాల్సినవన్నీ చూసుకున్నా ప్రయోజనం శూన్యమైనట్టే కనపడుతోంది

ఎగ్జామినర్—మేడమ్ ఇద్దరూ ఎక్కడా కనపడకపోయేసరికి ధైర్యం చేసి సుందరి ఎటెండర్‌ను దగ్గరకు రమ్మని సైగ చేసింది.

కుర్ర ఎటెండరు దగ్గరకొచ్చి మిక్స్చర్‌ను చూసి గబగబా ఏదేదో చెబుతున్నాడు

చటుక్కున మేడమ్ సుందరి దగ్గరకే వచ్చింది.

ఎగ్జామినర్ దూరంగా డస్క్ దగ్గరే నుంచున్నాడు

''యూ ఫూల్ ! నీకు సిగ్గులేదు ఇకమీదట నిన్ను ప్రాక్టికల్స్‌కి వెయ్యకూడదు రాడికల్స్ చెప్పేస్తున్నావా ?''

## వేగం

ప్రొద్దున, ఉపనయనం,
మధ్యాహ్నం, వివాహం,
రాత్రికి గర్భాధానం —
వఊకూ, వేగం పెరిగింది
స్పుట్నిక్ యుగంలో !
అయితే —
సద్యో గర్భాలూ
సద్యః ప్రసవాలూ
ఇంకా కావడంలేదు !

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

గదమాయించింది

సుందరికి కళ్లెత్తడానికి భయం వేసింది

''ఆ ఎగ్జామినర్ మన కాలేజీ గురించి — మన గురించి ఏమనుకుంటారు ? ఇల్లాంటి వాళ్లవల్లే సంస్థకి చెడ్డపేరు అందరికీ తెద్దునా కొందరికే తెద్దునా అని సామెత చెప్పినట్టు అందరి పరువు తీసేవాళ్లు ఈ పిల్లలు — వాళ్లకి తగ్గవాళ్లు మీర క్లాసులకి శ్రద్ధగా రాకూడదూ !''

ఊ గొడవ పెట్టేస్తోంది మేడమ్

గబగబా ముసలి ఎటెండర్ గురువులు మేడమ్ దగ్గరకొచ్చాడు

''ఊరుకోండమ్మగోరూ ! ఆయనగోరు ఇంటే బాగోదు . ఏదో సిన్నమాట సెప్పినంత మాత్రాన ఏటయిపోద్ది ? . నేనే అవాడు మీ పరీచ్చల్లో మీకేటీ సెప్పకపోతే ఇయ్యాలిలా అయ్యేవోరా ?''

ఈ మాటలు అద్దంలో కనపడుతున్న గురువులు మనసులోని మాటలు కావు తొణకకుండా బెణకకుండా సూటిగా మేడమ్ కళ్లలోకి చూస్తూ సన్నని స్వరంతో అన్నాడు

మేడమ్ మరి అక్కడనుంచో లేదు ముఖం ఎర్రగా చేసుకుని కిటికీ పద్దకు వెళ్లి దూరంగా నున్నటి కొండ వంక చూస్తోంది

గురువులు మాత్రం ఇంకా అక్కడే నుంచున్నాడు కళ్లెత్తి అతని కళ్లలోకి చూసింది సుందరి

''ఒద్దు సేరిపోవాక అందరూ నీతులు సెప్పేవోళ్లే . ఆ ఎగ్జామినర్ దగ్గర ఈ గురివిందమ్మగోరు గోలోజనం ! .అవిడ మళ్లిటొచ్చి నారంటే బండారం బయటెట్టేస్తా . నన్నేటి సేస్తారు ఈ కుర్రకుంకలు .''

—అద్దంలో గురువుల ఆలోచనను అవగాహన చేసుకుని, కుర్ర ఎటెండర్ చెప్పిన మాటలు నెమరు వేసుకుంటూ బరబరా ఆన్సరు రాసేస్తోంది సుందరి

''అరవిందగారూ !''

ఎగ్జామినర్ మేడమ్‌ను దగ్గరగా రమ్మని పిలుస్తున్నాడు

మరి కళ్లెత్తి ఎటూ చూడదలచుకోలేదు సుందరి. ★

# చెమటతో వళ్ళు పేలినప్పుడు...




జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడర్ మీకు ఎండనుంచి తక్షణమే ఉపశమనాన్ని యిస్తుంది, ఎందుకంటే దానిలో 3 రకాలుగా ప్రభావితంగా పనిచేసే, ఋజువైన ఔషధీయుక్తమైన ఫార్ములా ఉంది

- అది క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది
- చెమటను పీల్చుకుంటుంది.
- దురదనుంచీ, మంటనుంచీ ఉపశమనం యిస్తుంది—తక్షణమే

## జాన్సన్స్*
## ప్రిక్లీ హీట్ పౌడర్‌తో ఉపశమనాన్ని పొందండి.




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

**ఎండలో తక్షణమే ఉపశమనం!**

Johnson & Johnson*

( గత సంచిక తరువాయి )




మరునాటి ఉదయమున పాండవులు అవనీసురాశీర్వాదములందుచు ఈశ్వరుని సుగంధ పుష్ప ధూప దీపంబులచే పూజించి నైవేద్యమిడి వేయివేల ప్రధానప్రముఖులకు కుబేర ప్రభృతి భూత యక్ష జనంబులకును నైవేద్యములిడి నిరూపించిన చోటు త్రవ్వితి అంత నమోఘ ప్రభలతో బంగారు నిక్షేపము బయల్పడినది





















వెంటనే ఆ బాలుడు కండ్లు తెరచి అటునిటు కదలుచు ఆడుకొనసాగెను




[ఇంకా ఉంది]




శ్రీమతి–కాత్యాయని

సీరియల్

ఆ సమయంలో – అచేతనంగా వేళ్ళాడుతూ. రక్తంలో తడిసి భయంకరంగా ఉన్న వెంకటరత్నాని తీసుకొచ్చి – నట్టింట పడుకోబెట్టారు!

కెవ్వుమన్నారంతా!

ఘోరు ఘోరున ఏడ్చేస్తున్నారు!

తార తలను స్తంభానికేసి కొట్టుకుంటూ విలపిస్తున్నాది చప్పున వచ్చి పట్టుకున్నాడ రామ్మోహన్

అంత పెద్దమనిషి వెంకట్రామయ్యగారుకూడా నిగ్రహించుకోలేకపోయారు! చంద్రం చిన్నపిల్లాడిలా వెంకటరత్నంపై పడిపోయాడు.

క్షణాల్లో ఆ యిల్లు శోకమందిరంలా మారిపోయింది! సత్యవతి కడుపుకోత ఊరంతా దద్దరిల్లుతోంది!



(గత సంచిక తరువాయి)

**వెం**కట్ శరీరాన్ని తీసుకొని గ్రామంపైపుకి బయుదేరారు!

అప్పటికి సరిగ్గా సమయం ఏడున్నర అవుతోంది!

ఆరోజు సిద్ధమైన తార ప్రయాణం డి.ఎస్.పి వాడావుడితో ఆగిపోయింది ఈ రెండు రోజులూ ఏ వార్తలూ లేకుండా ప్రశాంతంగా ఉండటం గమనించి తేలికయిన గుండెలతో మధ్యాహ్నం బండికి ప్రయాణమయ్యారు అదే సమయంలో ఇళ్ళు అంటుకున్నాయి అనే వార్త తెచ్చాడు వెంకటేశ్వరావు! ఆ విషయం విని మళ్ళీ ఆగిపోయారు

వెంకటేశ్వరావు ఆ ప్రదేశానికి వెళ్ళి అంతా చూస్తూనే ఉన్నాడు దూరంగా చెట్టు క్రింద నిలబడి ఉన్న క్రిస్టియన్ ఫాదర్‌ని కూడా చూసాడు అయితే అతను తనలాగే వచ్చి చూస్తున్న మరో విప్లవ నాయకుడని అనుకున్నాడు గానీ పళనియప్పన్ అని అనుకోలేకపోయాడు! తర్వాత ఇంటికి వచ్చి "భంగారు పడాల్సిందేమీలేదు! వెంకట్ రానూ వచ్చాడు, అందరకూ అన్నీ అమర్చి రాజాలాగా వెళ్ళిపోయాడు! అతన్ని పట్టుకోవటం అంత సులువా!" అని సంతోషంగా చెప్పాడు 'హమ్మయ్య!,' అందరి మనస్సులూ కాస్త కుదుటపడ్డాయి

అపుడే స్వప్నకు అన్నంపెట్టి, రేణుకు పాలు పట్టింది తార. వెంకట్రామయ్యగారు కూడా ఇంట్లోనే ఉన్నారు ఎనిమిది గంటల బండికి వెళ్ళటానికి సిద్ధమవుతున్నారు.

ఆ సమయంలో కూడా పరిగెత్తుకుంటూ వచ్చేస్తున్నారు – వెంకటరత్నం ప్రజలు!

ప్రసాదు వెంకటరత్నానికి బట్టలు మార్చాడు గొంతు దగ్గర రక్తం గడ్డకట్టి అసహ్యంగా, భయంకరంగా ఉన్నాది! ముఖాన ఉన్న రక్తపు చారికలు తుడిచి మెడను తెల్లటి బట్టతో కప్పారు!

అంత రాత్రి సమయంలో కూడా అతని మరణవార్త ఎలా తెలిసిందో, ఏమో – ఎక్కడెక్కడి వాళ్ళో వచ్చేయటం ప్రారంభించారు!

స్వప్నను రామ్మోహన్, రేణుకను వెంకటేశ్వరావు తీసుకుని బయట వరండాలో స్తంభాల నానుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు!

పెట్రొమాక్సులైట్లు తెప్పించారు!

పెద్ద పెద్దవిగా ఉన్న ఎర్ర జెండాలు పరచి వాటిపైన వెంకట్‌ను పడుకోబెట్టారు!

అతన్ని అలా చూస్తుంటే అతనింకా స్టేజిపై నిలబడి ఆవేశంగా ఉపన్యసిస్తున్నట్లే ఉంది! ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసి, తమ హక్కులకోసం ఎదురు తిరిగి పోరాడే శక్తిని రేకెత్తిస్తున్నట్లుగానే ఉంది! స్వార్థపరులగుండెల్లో గుబులు పుట్టించి, ప్రజాశక్తిని మించినదేదీ లేదనీ, ఆ శక్తి అంతా కలిసి ఏకమైన నాడు దాని ధాటికి ఎవరూ ఆగలేరని హెచ్చరిస్తూ, సవాలుచేస్తూ గుబగుబలాడిస్తున్నట్లే ఉన్నాడింకా!

**జరిగిన కథ–22** కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార. ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటయిన తరువాత కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది ఫలితంగా వెంకట్‌ను పట్టుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తుంటుంది పోలీసుశాఖ. డి. యస్. పి. పళనియప్పన్ పేరు వింటేనే అందరూ వణికిపోతున్నారు వెంకట్ జ్వరంతో మంచాన పడతాడు డాక్టర్ రాఘవయ్యగారి మూలంగా కోలుకొంటాడు మళ్ళీ తన కార్యకలాపాలు కొనసాగించాలని నిర్ణయించుకొంటాడు. యింటి నించి పారిపోయి మారువేషంలో తిరుగుతున్న వెంకట్‌ని వెంబడించి, సిగట్టి చాటుగా తుపాకీతో కాల్చిచంపిన డి. యస్. పి పళనియప్పన్‌ని విప్లవకారులు నరికేసారు

'ఏ కొంతమందినో కాల్చేసినంత మాత్రాన విప్లవం చల్లారదు! ఒక వెంకట్ చచ్చిపోతే వేల కొలది, లక్షల కొలది, కోట్లకొలది వెంకట్‌లు పుడతారు! ఈ అన్యాయాలనూ, అక్రమాలనూ ఎదుర్కొంటారు! ప్రతి మనిషీ హాయిగా బ్రతికే రోజు వచ్చేవరకూ ఈ సామూహిక విప్లవం చల్లారదు!'' అని అతడు ఎలుగెత్తి చెబుతూనట్లే ఉన్నాది! అవన్నీ గుర్తుకొచ్చి వెక్కి వెక్కి ఏడ్చేస్తున్నారు!

ఎక్కడెక్కడి నుండో అంత రాత్రిపూట కూడా సైకిళ్ళపైనా, బండ్లపైనా వస్తున్నారు!

అమాయకులైన తన చిన్న బిడ్డలను రక్షిస్తాడనుకున్న పెద్దకొడుకు అకస్మాత్ అస్తమయం భారత మాతనే కదిలించింది కాబోలు - ఆమె కన్నీటికి గుర్తుగా నేలంతా తడిచింది!

తెల్లవారింది!

ఎక్కడెక్కడి నుండో, ఎవరెవరో కార్లల్లో వస్తున్నారు! లారీల్లో వస్తున్నారు! పూవుల దండలూ, ఎర్ర జెండాలూ తెచ్చి వెంకటరత్నం భౌతిక దేహంపై కప్పుతున్నారు!

కొంతమంది పేదప్రజలు – ముసలివాళ్ళు వెంకటరత్నం దేహాన్ని పట్టుకుని భోరున ఏడ్చేస్తున్నారు! అలాటి వాళ్ళను పోలీసులు బలవంతంగా అవతలకు తీసుకుపోతున్నారు! వెంకటరత్నం బ్రతికుండగానే కాకుండా, అతను చచ్చిపోయినాక కూడా పోలీసులు కాపలా కాస్తూనే ఉన్నారు!

ఇంట్లో మనుష్యులు మనుష్యులుగా లేరు! ముఖమంతా ఉబ్బిపోయి, కళ్ళు లోపలకు పీక్కుపోయి– చచ్చిపోవటానికి సిద్ధం అన్నట్లుగా ఉన్నారు!

చంద్రం పిల్లలను ఎక్కడికో తీసుకెళ్ళి పాలు పట్టించి తీసుకొచ్చాడు

ఆ ఉదయం పదిగంటలకు వెంకటరత్నం శరీరాన్ని తీసేద్దామనుకున్నారు! కాని, 'అతను బ్రతికి ఉన్నపుడే కాకుండా చచ్చిపోయాక కూడ ప్రజలమనిషే' అన్నట్లుగ అతన్ని చూస్తానికి జనం ఇంకా వస్తూనే ఉన్నారు!

నిన్నరాత్రి ఏడున్నర గంటలనుండీ తార కంటికి ఆనకట్ట లేకపోయింది! అట్లా ఆ శవం ప్రక్కన కూర్చుని విలపిస్తూనే ఉంది! ఎంత ఏడ్చినా 'ఆ జ్యోతి తిరిగి వెలగదు' అనే సత్యం అందరకూ తెలుసు! అలాగని ఎవ్వరూ ఆవేదనకు లొంగకుండానూ ఉండలేరు!

సాయంత్రం అవుతున్నాది! అయినా కూడా జనం వస్తూనే ఉన్నారు! ఇంక ఉంచటానికి వీల్లేదని అతడ్ని తీయటానికి ప్రయత్నాలు చేస్తున్నారు!

ఊరిలోనివారు, ఒక్క ఊరే కాకుండా- చుట్టు ప్రక్కల ఊళ్ళవాళ్ళు – పై ఊర్లనుండి వచ్చిన వాళ్ళతో ఆ ఇల్లూ, ఆ వీధీ, ఆ ఊరు ఊరే కిటకిటలాడిపోతున్నాది!

చచ్చిపోయినా కూడా మరచిపోనంత సజీవంగా నిలచిపోయిన అతని చిరునవ్వు ఎందరికో ఎన్నో సందేశాలను అందిస్తున్నట్లుగానే ఉన్నది!

అయిపోయింది! ఒక చైతన్య ప్రవంతిలాఉండే వెంకటరత్నం చరిత్ర సమాప్తమయిపోయింది!

అతని భౌతిక కాయాన్ని పైకి ఎత్తారు! తార, సత్యవతి, కళ్యాణి, వెంకట్రామయ్యగారు, నాగరత్నమ్మ, చంద్రం, వెంకటేశ్వరరావు, శ్రీనివాసరావు ఎంతోమంది ఒక్కసారిగా ఘొల్లుమన్నారు!

ఆ ఘోష నలుదిక్కులనూ ఒక్క ఊపు ఊపిందనిపించింది!

* * *

'వెంకటరత్నం అస్తమయం మొత్తం పార్టీకే తీరని నష్టం!''

'విప్లవానికి ప్రాణం లాంటివాడు వెంకటరత్నం! అతను ఇహ లేడు అనుకుంటే కాళ్ళులేని మనిషిలా అయిపోయింది విప్లవం!''

'వెంకటరత్నంలేని పార్టీ జీవంలేని కట్టె! చైతన్యం అనే మహా సముద్రం ఎండిపోయినట్లుగా అయిపోయింది!''

'వెంకటరత్నంలేని పార్టీ తిరుణాలలో తప్పిపోయిన చిన్న కుర్రాడిలా – ఏం చేయాలో తోచని స్థితిలో దిక్కుముఖంతో ఉన్నాది!''

'వెంకటరత్నంలేని లోటు ఎవ్వరూ ఏనాటికీ తీర్చలేనిది! అతని కుటుంబ సభ్యులకు మా సంతాపం తెలియపర్చుకుంటున్నాము!''

'వెంకటరత్నం ఒక వ్యక్తి కాదు! ఒక మహా శక్తి! అతన్ని పోగొట్టుకొన్న కమ్యూనిస్టు పార్టీ – ఇరుసు జారిన చక్రంలాగా ఉంది''

'వెంకటరత్నం చచ్చిపోలేదు! శారీరకంగా అతను మనకు దూరమయినా అతని ఆత్మ మనలోనే ఉంది! అతని ఆశయాలూ, అతని లక్ష్యాలూ జీవించే ఉన్నాయి! అతను అమరజీవి!''

'కామ్రేడ్! వెంకటరత్నం!''

అంటూ రకరకాల వ్యాఖ్యానాలతో, ప్రముఖుల



ఎంతాపాలలో, అతని ఫొటోలతో నిండిన పేపర్ను చూస్తుంటే తారను పట్టుకోవటం అశక్యమై పోతూంది!

అతని మరణానికి సంతాప సూచనగా అనేక చోట్ల అనేక సభలు జరిగాయి! ఊరేగింపులు జరిగాయి!

ఎంతోమంది పెద్దలు అతని మరణానికి విచారిస్తూ, భార్యాపిల్లలను తల్లితండ్రులను ఓదారుస్తూ ఉత్తరాలు వ్రాసారు!

ప్రజల నివాదాలు మిన్నుముట్టుతున్నాయి!

అదొక ప్రజానెల్లువ!

ఎక్కడ విన్నా వెంకట్!

ఎక్కడ చూసినా వెంకట్!

ఇన్ని లక్షల మంది గొంతెత్తి పిలుస్తున్నా వినిపించుకోలేనంతటి దూర దూర ప్రదేశాలకు వెళ్ళిపోయాడు వెంకటరత్నం!

ఇందరి గుండెల్లో గూడుకట్టుకుని ఉండిపోయిన వెంకటరత్నం — కామ్రేడ్ వెంకటరత్నం — నిజంగా ధన్యజీవి!

ప్రతి ఇంట్లోనూ అతని ఫొటో వెలిసింది!

ఫొటో క్రింద —

పుట్టిన తేదీ 4-4 1924 చచ్చిపోయిన తేదీ 10-4-1950 అని వ్రాయించారు

అది చూసిన తార హృదయంలో అగ్నిజ్వాలలు రేగాయి!

'ఇరవై ఆరు సంవత్సరాలు నిండీ నిండకుండానే అతన్ని బలవంతంగా చంపేసిన ప్రభుత్వాన్ని ఏం చేసినా పాపంలేదు!' అని కసిగా తిట్టుకుంది

* * *

తార పుట్టింటికి వచ్చేసింది!

ఈసారి తార పుట్టింటికి రావటంలో చాలా తేడా ఉంది!

పువ్వూ, బొట్టూ తెంపుకుని, గాజూ పూసా తీసేసి — విరాగినిలాగా తిరిగి వచ్చిన కూతుర్ని దగ్గరకు తీసుకుని చిన్న పిల్లవాడిలాగా ఏడ్చేసారు!

"ప్రజాక్షేమం, ప్రజాక్షేమమంటూ ఉన్నవాళ్ళా వాళ్ళ సౌభాగ్యం కోసమే బ్రతికిన వెంకటరత్నం నీకీ సౌభాగ్యాన్ని మిగిల్చిపోయాడా తల్లీ" అంటూ కుళ్ళి కుళ్ళి ఏడ్చారు!

తెల్లవారంగానే ముఖం కడుక్కుని, బొట్టు పెట్టుకుని వాకిలినిండా చక్కని ముగ్గులు తీర్చే తార బోసి ముఖంతో పిచ్చిదానిలాగా ఉంటే చూడలేకపోతున్నాడు చంద్రం!

మోహన్ ప్రసాద్‌తో కలిసి బందరు వెళ్ళి పోయాడు! అతడు గుడివాడలో ఉన్నన్ని రోజులూ వీలయినపుడల్లా అక్క దగ్గర కూర్చుని ఆమె పిర్లిప్తతను పోగొట్టటానికీ, ఆమె దృష్టిని పిల్లల వైపుకు త్రిప్పటానికీ శతవిధాలా ప్రయత్నించాడు!

జయమ్మ ఇంకా ఇక్కడే ఉన్నది! ప్రస్తుతం పిల్లల ఆలనా పాలనా అంతా ఆమే చూస్తున్నాది!

తార వచ్చి వారం రోజులయిపోయింది. ఆమెని పరామర్శించటానికి వచ్చేవాళ్ళూ, పోయేవాళ్ళూనూ!

ఆ రోజు వెంకట్రామయ్యగారు వచ్చారు! పిల్లలకు పండ్లూ, బిస్కట్లూ తీసుకొచ్చారు!

"తాతగారూ! నాన్నగారు రాలేదా?" అమాయకంగా అడుగుతూన్న స్వప్నను దగ్గరకు తీసుకుని ఆయన కూడా ఏడ్చేసారు

సాయంత్రంవరకూ ఉండి వెళ్ళారు!

ఈ వారం రోజుల్నుండీ తారకు ఒకటే ఆలోచన!

"భవిష్యత్ ఏమిటి?"

రాత్రిపూట అందరూ నిద్రపోయాక దిండులో తలదూర్చి పిచ్చిదానిలాగా ఏడ్చేసేది! వెంకట్‌ను తలచుకొని కుళ్ళి కుళ్ళి ఏడ్చేది! కళ్ళుమూస్తే చాలు— గంభీరమయిన అతని చూపూ, మనోహరమయిన అతని చిరునవ్వూ ఆమెని పిలుస్తున్నట్లే ఉండేవి!

"వెంకట్! పోతూ పోతూ నా కాళ్ళకు ఈ బంధాలెందుకు వేసారు! పిల్లలు పుడుతున్నారంటే మన ప్రేమకు చిహ్నాలనీ, మన దాంపత్యపు ఫలాలనీ, మన మధ్యకల అనురాగపూరితమైన అతి సున్నిత బంధాన్ని పటిష్టం చేస్తున్నారనీ ఏవేవో ఊహించి మురిసిపోయానే తప్ప — ఈ విధంగా మీతో కలిసి ప్రయాణం చేయటానికి నా కడ్డుగా నిలుస్తారని ఊహించలేదు వెంకట్! తెలిస్తే వచ్చినా పిల్లల్ని కనేదాన్ని కాదు!" హృదయంలోని బరువంతా కరిగి కన్నీ ళ్ళయ్యేవరకూ విలపిస్తుండేది!

"ఈ పిల్లల్ని ఎలా పెంచాలి! ఎలా పెద్దవాళ్ళను చేయాలి! వీళ్ళకు చదువులూ, బట్టలూ — ఎన్ని ఖర్చులు! ఎన్నాళ్ళని ఈవిధంగా ఒకళ్ళమీద ఆధారపడి బ్రతకటం! ఎంత పుట్టిల్లు అయినా వస్తూ పోతూ ఉంటే అదొక అందమూ, విలువా ఉంటాయి! కాని, శాశ్వతంగా ఇక్కడే ఉండిపోవటం— భగవాన్! నా యీ జీవితంలో ఇంతవరకూ నిన్నెపుడూ తల్చుకో లేదయ్యా! కానీ, నా జీవితాన్నిలా ఎందుకు అస్తవ్యస్తం చేసావు? నేను నీకేమి అపకారం చేసాను? నా బిడ్డలు నీ కేమి అన్యాయం చేసారు? ఎందుకిలా వాళ్ళని తండ్రిలేని దౌర్భాగ్యుల్ని చేసావు? అసలు నా భర్త చేసిన తప్పు ఏమిటయ్యా? తోటి మనిషికి సాయపడటం తప్పా? 'మానవ సేవే మాధవ సేవ!' అని అంటారే! మరి మానవ సేవలోనే సర్వస్వమూ వెచ్చించి శ్రమించిన నా భర్త తలకాయ నెందుకు తీసారు! న్యాయాన్ని, ధర్మాన్ని పరిపాలించేవాడు దేవుడంటారే — నీవూ ఒక ధర్మమూర్తివే అయితే ధర్మం కోసం, న్యాయం కోసం పోరాడుతూన్న నా భర్త ప్రాణాన్ని ఆ దుర్మార్గుడు బలవంతంగా తీస్తూ ఉంటే నువ్వేం చేస్తున్నావయ్యా! చూస్తూ ఊరుకోవటానికి నీకు పౌరుషం అడ్డురాలేదా? ఒక మంచి మనిషి ప్రాణాలు తీస్తూ ఉంటే అడ్డుకోలేని నీవూ ఒక దేవుడివేనా? నీకు పూజలు వేరే కావాలా! లేదు, లేదు! నువ్వు ఉత్త రాతి బొమ్మవు! నీలో ఏ శక్తీలేదు! నీలో ఏ మహాత్మ్యమూలేదు! ప్రజలు పిచ్చివాళ్ళై, వెర్రి వాళ్ళై గుడ్డి నమ్మకాలతో ఎందుకూ పనికిరాని రాళ్ళను దేవుళ్ళంటూ పూజలు చేస్తున్నారు! అంతే! దైవత్వం నీలో లేదు! ఒక మంచి పనికోసం బ్రతికి నన్నాళ్ళూ పాటుపడి, దానికోసమే శ్రమించి, అందులోనే ప్రాణాలు పోగొట్టుకొన్న నా భర్తముందు నువ్వు ఏపాటి దేవుడివి?"

అంతూ పొంతూలేని ఆలోచనలతో రాత్రులకు రాత్రులు గడిపేది తార!

(ఇంకా వుంది)






గెలవండి

# బంగారం!

బంగారం! బంగారం!

## స్కోర్

## లక్కీ గిఫ్ట్ స్కీమ్

మొదటి బహుమతి
35 తులముల బంగారం
లేదా
రు 65,000 నగదు
మరియు
అమూల్యమైన 181
ఇతర బహుమతులతో

**1-4-1982** నుండి
**30-6-1982** వరకు

డ్రా : **31-7-1982**

## ఉచితం!

ప్రతి రెండు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలతో ఒక లక్కీ బహుమతి కూపన్ ఉచితం। ప్రజల సమక్షంలో నిర్వహింపబడే కూపన్ డ్రాలో బహుమతి విజేతలు ప్రకటింపబడుదురు।




మరింతగా మీరు కొనసాగినంత ఎక్కువగా స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళలను కొనండి। మీరు బహుమతులు గెలుచుకునే అవకాశాలు పెంపొందించుకోండి।

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వారా ఈ స్కీమ్ అనుమతింపబడినది.










# సహగమనం

## చిన్నకోట సుశీలాదేవి

చరిత్ర శిధిలాలలో చేర్చదగిన సతీ సహగమన దురాచారాన్ని గురించి 1982లో వ్రాయడానికి పూనుకుంటే చాలా ఆశ్చర్యంగా వుండవచ్చు, కానీ 1980లో రాజపుత్ర స్థానంలో ఏడు సహగమనాలు జరిగాయి స్వతంత్ర భారతదేశ ప్రభుత్వం నాటిని ఆపలేకపోయింది ఒక స్త్రీ చేసిన సహగమనాన్ని "చాలా ధైర్యంతో కూడిన పని!" అని రాజస్థాన్ ఇన్‌స్పెక్టరు జనరలు వ్యాఖ్యానించారు. ఆ సహగమనం జరిగిన ప్రదేశంలో సతీ దేవాలయాన్ని కడతారట అదిప్పుడు ఒక యాత్రా స్థలమైంది ఆ ప్రాంతాన్ని రాజపుత్ర యువకులు ఖడ్గాలు ధరించి రాత్రీ పగలు వంతులవారిగా కాపలా కాస్తున్నారు.

సహగమనం పునరుద్ధరించబడనున్న సూచనలు రాజస్థాన్‌లో కనిపిస్తున్నాయి అంతేకాదు అక్కడ ఆ దురాచారానికి పురోహితులు, అధికారులు, ప్రజలు మద్దతు ఇస్తున్నట్లు కూడా కనిపిస్తోంది

భారతదేశ చరిత్రలో రజపుత్రుల కాలం ఎంతో విషాద భరితమైంది శ్రీహర్షుని మరణం తర్వాత ఢిల్లీలో తురుష్క రాజ్యస్థాపన జరిగేవరకూ ఉత్తర భారతాన్ని రాజపుత్రులు పరిపాలించారు. వీరు మహమ్మదీయ దండయాత్రల నుండి దేశాన్ని రక్షించలేకపోయారు. వీరు చిన్న చిన్న రాజ్యాలు స్థాపించి, నిరంతరం అంతఃకలహాలలో - పరస్పర యుద్ధాలలో మునిగి తేలుతూ వుండేవారు మహమ్మదీయులను ఎదిరించడానికి కావలసిన ప్రజాబలం, ఆయుధబలం, యుద్ధ వ్యూహరచనా నైపుణ్యం లేకపోయింది

అంతేకాదు. అభివృద్ధికరమైన మార్పులను ప్రవేశపెట్టి ప్రజాక్షేమానికై ప్రయత్నించలేదు అందుచేతనే స్వల్పసైన్యంతో మహమ్మదీయులు వీరిని జయించగలిగారు. హిందూ స్వాతంత్ర్యం పోవడానికి వీరే కారకులు ఇక వీరు సాధించిందేమిటంటే - మహమ్మదీయులు వీరి భార్యలను తిరిగి పెళ్లి చేసుకోకుండా సహగమనం - జౌహారు అనే దురాచారాల్ని స్త్రీలు పాటించేట్లు చేయడం!

అందుచేత నేడుకూడ రాజపుత్రులు ఈ అనాగరిక ఆచారాన్ని ప్రోత్సహిస్తున్నారంటే మనం ఆశ్చర్యపడక్కర్లేదు!

అతి ప్రాచీన కాలంలో - ఇండో ఆర్యులు స్త్రీని చాలా గౌరవించారు. ఋగ్వేద కాలంలో వితంతువులు అలంకార విహీనలుగా వుండేవారని చెప్పబడింది అధర్వణ వేదంలో స్త్రీలకు పునర్వివాహం జరిగినట్లు చెప్పబడింది గృహ్య సూత్రాల కాలంలో సతీసహగమనం పాటించినట్లు లేదు ధర్మ సూత్రాలలో కూడా భర్తలు చనిపోయిన తర్వాత భార్యలు బ్రతికివున్నట్లుంది. బోధాయనుడు, వశిష్ఠుడు వితంతువు పునర్వివాహం చేసుకోడానికి సమ్మతించారు

అసలు జీవితమంతా విధవగా వుండాలనిగాని, లేదా భర్తతోపాటు సహగమనం చేయాలని కాని ఏ శాస్త్రకారుడు చెప్పలేదు. భర్త చనిపోయిన స్త్రీ - బిడ్డలు కావాలనుకుంటే అతని సోదరుని ద్వారా బిడ్డలను పొందవచ్చునని ఆనాటి పెద్దలు అంగీకరించారు! ఈ నియోగపద్ధతి - సహగమన దురాచారం ఆ కాలంలో లేదని నిరూపిస్తోంది.

స్త్రీ రెండవ వివాహంవలన కలిగిన బిడ్డలను కూడా వారసులుగా కొందరు శాస్త్రకారులు అంగీకరించారు

అయితే ఈ దురాచారం తరువాతి పురాణ కాలంలో వచ్చి వుంటుంది. అయినా ఈ దురాచారం ఎప్పటినుండి వచ్చింది? అనేదికాదు ముఖ్యం! చిహ్నాలు కూడా లేకుండా ఈ దురాచారాన్ని నిర్మూలించడం ఎలాగా అని అందరూ ఆలోచించాలి

హిందూమతం ఇతర మతాలకంటె చాలా గొప్పదని, అది ప్రపంచానికే మార్గదర్శకమని హిందువులు ప్రగల్భాలు పలుకుతుంటారు కానీ హిందూమతం పేరిట సంఘంలో నెలకొనివున్న క్రూర దురాచారాలను రూపుమాపడానికి ప్రయత్నించరు

ఈ సతీసహగమన దురాచారాన్ని పోగొట్టడానికి ప్రయత్నించినవారు, పోగొట్టినవారు మహమ్మదీయులు, ఆంగ్లేయులు!

అక్బరు సహగమనాన్ని నిషేధించాడు! ఆ తర్వాత జహంగీర్ - ఒక స్త్రీని సహగమనం చేయవలసిందని బలవంతంపెట్టే నేరానికి మరణ దండన విధించాడు. ఔరంగజేబు 1663లో - 'మొగలు రాజ్యంలో బ్రతికివున్న ఏ స్త్రీని దహనం చేయనివ్వం' అని ప్రకటించాడు. కాని పాదుషాలు చేసిన ఈ చట్టాలను ప్రజలు లక్ష్యపెట్టలేదు

సహగమన దురాచారం భారతీయ వితంతువులను అగ్నిజ్వాలలకు ఆహుతి చేస్తూ వచ్చింది సహగమనం చేయడానికి ఇష్టపడని స్త్రీని బలాత్కారంగా మంటలలో పడేసి తాళ్లతో కట్టి లేదా పచ్చని కర్రలతో తోసి మంటల్లో ఆహుతి అయ్యే వరకూ చూస్తూ వుండేవారు. మంటలకు భయపడి తప్పించుకొని వచ్చిన స్త్రీలను కూడా మళ్లీ మంటల్లో పడేసి చచ్చిపోయేవరకు కాపలా కాసేవారు మంటల్లోకి పోలేని స్త్రీకి మత్తుమందిచ్చి స్పృహ లేకుండా చేసి కాల్చేవారు. కొన్ని సందర్భాలలో లోతైన గుంట త్రవ్వి భర్త శవంతోపాటు భార్యని కూడా అందులో పడవేసి కాల్చేవారు. తప్పించుకోవాలని ప్రయత్నం చేయకుండా వుండటానికి చేతులు, కాళ్లు కట్టి మంటల్లో పడవేసేవారు. పూర్తిగా కాలిపోయేవరకూ కాపలా పెట్టేవారు భయపడి బయటికి వస్తున్న స్త్రీని వెదురుకర్రలతో మళ్లా మంటల్లోకి నెట్టి అదిమిపెట్టేవాళ్లు! హృదయ విదారకమైన ఈ దృశ్యాలను ఆనాటి సమాజం మానవతా దృష్టి లేకుండా ఎలా హర్షించిందో? ఎలా ఇదంతా ధర్మం అని నమ్మిందో అర్థం కాదని "యుగయుగాల మహిళ" అనే పుస్తకంలో రచయిత్రి జె. వరలక్ష్మిగారు అంటూ ఆశ్చర్యపోయారు!

అయితే హిందూ పురుషునికి హృదయం లేదనే విషయం వారు తెలుసుకోకపోవటమే ఆశ్చర్యకరం

ఆంగ్లేయుల పాలనాకాలంలో కంపెనీ వుద్యోగులైన యూరోపియనులు, గవర్నర్ జనరల్ ఇది కిరాతకచర్య అని గ్రహించారు కాని బ్రాహ్మణ పురోహితులు, వారి అనుయాయులు ఇది మత ధర్మమని, శాస్త్రాల్లో చెప్పబడిందని వాదించడంతో ఆంగ్లేయులు - మత విషయాలలో కలగచేసుకుంటే ప్రజలు తిరుగుబాటు చేస్తారని భయపడి వూరుకున్నారు

అందువలనే రాజారామమోహన్‌రాయ్ 1812 నుండి 1829 వరకు సహగమన దురాచారానికి శాస్త్ర ప్రమాణం లేదని నిరూపించి దానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించవలసివచ్చింది

పతిని కోల్పోయిన సతి - ఆ చితిమీదనే ఎక్కి దహనమైపోతే స్వర్గారోహణచేసి అరుంధతితో సమానమైన శీలవతిగా పరిగణింపబడుతుందని - లక్షల సంవత్సరాలు మహదానంద స్థానంలో వుంటుందని బ్రాహ్మణ పురోహితులు వాదించారు వితంతువులను సహగమనం చేయమని వారు నిర్బంధించేవారు హిందూ సంఘంపై బ్రాహ్మణులకు



# రండి, ఎమల్షన్ ఫినిష్ యొక్క నిలిచే అందాన్ని గూర్చి పూర్తిగా తెలుసుకుందురుగాని.

మీ డబ్బుకు పూర్తిగా విలువ ముట్టే పెయింట్‌ను గూర్చి మీరింక ఏమంటారు మరి? అయినా, నెరొలాక్ పెయింట్స్‌ను గూర్చి ఎంతైనా చెప్పచ్చు మొదట్లో అయ్యే ఖర్చును గూర్చి గాబరా పడకండేం? నెరొలాక్ పెయింట్స్ వారి 'All you wanted to know about painting' అనే ఉచితంగా లభించే పుస్తకం కోసం రాయండి. దాన్లో మీకు తెలుస్తుందిక. సిలికోన్ గల నెరొలాక్ ఏక్రలిక్ ఎమల్షన్ మీకు ఏ విధంగా పొదుపుచేసి పెడుతుందీ అన్నది.

క్రింద యివ్వబడిన కూపన్‌ను నింపి వెంటనే పోస్టులో పంపించండి.

దయయుంచి నాకు నెరొలాక్ పెయింట్స్ పుస్తకం ఇంగ్లీషులో గల ప్రతిని ఒకటి పంపించండి.

పేరు: …

అడ్రసు: …

… పిన్‌కోడ్: …

165R BB

గుడ్‌లాస్ నెరొలాక్ పెయింట్స్ లి.
ఇన్‌ఫర్మేషన్ డెస్క్, పి.ఓ. బాక్స్ నం. 16322,
బొంబాయి-400 013.

జవాబుకోసం దయయుంచి 25 పైసల స్టాంపులను జతపరచండి

మనసుకు నచ్చేవి, యింట్లోవాళ్ళు అభిమానించేవి




ULKA-GNP-165R TEL




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### కె. ఎమ్. ఎస్. – గుంటకల్

నా వయస్సు 22 సం॥లు. నా చేతి కండరములు వణుకుతున్నాయి అందువల్ల ఏ పనీ చేయలేక పోతున్నాను. ఇంజక్షన్లు; మాత్రలూ వాడినా గుణం కనిపించలేదు?

★ కొందరికి ఏ కారణం లేకుండానే ఇలా జరిగే అవకాశం ఉన్నది. కొందరికి థైరాయిడ్ గ్రంధి ఎక్కువగా పనిచేయటం వల్ల ఏర్పడే థైరోటాక్సికోసిస్ అనే రోగం వల్ల ఇలా ఏర్పడే అవకాశం ఉన్నది కొందరికి నరాల బలహీనం (అంటే విటమిన్ల లోపాల వల్ల వచ్చేది) వల్ల ఇలా జరిగే అవకాశం ఉన్నది.

థైరాయిడ్ గ్రంధి పనితనాన్ని కొన్ని రక్త పరీక్షల ద్వారా కనుగొని మామూలు కన్నా ఎక్కువ పనితనాన్ని కలిగి ఉంటే తగిన చికిత్స చేయవలసి ఉంటుంది. రోగనిర్ధారణ చేయకుండా మందులు వాడటం వల్ల ఫలితం ఉండదు.

### డి ఎస్ – విజయవాడ

మీకు తెలిసిన ప్లాస్టిక్ సర్జరీ సెంటర్ల అడ్రసులు తెలుప ప్రార్థన?

★ హైదరాబాదులోని మెడికల్ కాలేజీ ఆస్పత్రులు, గుంటూరు మెడికల్ కాలేజీ, విశాఖపట్నం, మదరాసులోని జనరల్ హాస్పటల్, వేలూరు మొదలయినచోట్ల ప్లాస్టిక్ సర్జరీ సెంటర్లు ఉన్నాయి. ఆయా ప్రాంతాలలో హాస్పటల్లో మాత్రమేగాక అక్కడ పనిచేస్తున్న వైద్యులే ప్రయివేటుగా కూడా వారి డిస్పెన్సరీలలో చూస్తారు.

### వి. హెచ్. ఎమ్. – ఆముదాలవలస

నాకు 3 నెలల నుండి మొహంపై ఎర్ర మచ్చలు లేచి కురుపులు వచ్చినవి. ఇంట్లో చదువుతూ కూర్చుంటే ఊపిరి సరిగ్గా తీయలేక పోవుచున్నాను. ఇవి ఏమైనా వ్యాధి లక్షణములా? నివారణోపాయములు తెలుప ప్రార్థన?

★ ఇది ఇంపెటైగో కన్టేజియోసా అనే లక్షణం. దీనికి స్టెఫలోకాక్కస్, స్ట్రెప్టోకాక్కస్ అనే సూక్ష్మక్రిములు కారణం అవుతాయి. వీటిని నివారించటానికి సల్ఫా, పెన్సిలిన్, టెట్రాసైక్లిన్ల వంటి యాంటిబయాటిక్ మందులు వైద్యుల పర్యవేక్షణలో వాడవలసి ఉంటుంది.

చదువుకొనే సమయంలో ఆయాసం రోగ లక్షణం ఏమాత్రమూ కాదనే చెప్పవలసి ఉంటుంది చదువంటే భయం -- జుగుప్సవల్ల ఏర్పడే అవకాశం ఉంటుంది.

### కె. కె – నూజివీడు

నాకు 3 సంవత్సరముల నుండి చెవిలో దురదగా వుంటుంది. బాగా దురదగా వున్నప్పుడు చెవిలో కెలకటంవల్ల వాపు, పోటు వస్తున్నాయి. నీరు కమ్మినట్లు వుంటుంది. డ్రాప్సు వాడితే కొంచము తగ్గి ఆరు నెలకి మరలా వస్తోంది స్పెషలిస్టుకి చూపిస్తే చెవి క్లీను చేసి మందులు వాడమని చెప్పారు మందులు వాడినా మరల వచ్చినది. దీనికి మీ సలహా ఏమిటి?

★చెవులలో దురదరావటానికి ఫంగస్ఇన్ఫెక్షన్ ముఖ్యకారణం. పుల్లలతో కెలకటంవల్ల ఈ లక్షణం ఇంకా లోతుకి పాతుకుపోయే అవకాశం ఉంటుంది

అడపాదడపా రావటం అనేది మీరు స్నానానికి వాడే నీళ్ళు కలుషితం అయి ఉండటాన్ని తెలియ జేస్తున్నది చెవులలో ఒటెక్ డ్రాప్స్ వాడటంవల్ల ఉపశమనం కలుగుతుంది క్లీన్ చేయటం అనవసరం

### వి. ఎస్. ఎల్. – ఏలూరు

నాకు చాలాకాలం నుండి తుమ్ములూ, ముక్కు నుండి నీరు కారటం జరుగుతుంది. సాధారణంగా కుంకుడుకాయ రసంతో తల స్నానము చేసినచో విపరీతముగా వెంట వెంటనే తుమ్ములు వస్తాయి ప్రతిరోజూ 20 సార్లు అయినా తుమ్ములు వస్తాయి ఇవి తగ్గటానికి మార్గము ఏమిటి?

★ తుమ్ములు రావటానికి ముక్కులోని మ్యూకస్ మెంబ్రేన్ ప్రేరేపింపబడటమే ముఖ్య కారణం ఇలా ప్రేరేపింపబడటానికి అలర్జీ ముఖ్య కారణం అవుతుంది. ఈ అలర్జీ దేనివల్లనైనా రావచ్చును. కొందరికి దుమ్మువల్ల, కొందరికి ఆహార పదార్థాలవల్ల, కొందరికి మామూలు వస్తువులవల్ల ఈ అలర్జీ ఏర్పడుతుంది.

కుంకుడుకాయ వాడటంవల్ల వస్తుందని తెలిస్తే వాటి వాడకం మానవలసి ఉంటుంది అలర్జీ తగ్గటానికి తాత్కాలికంగా అవిల్, పిరిటాన్ వంటి మందులు వాడవలసి ఉంటుంది కొన్ని ప్రాంతాలలో అలర్జీ క్లినిక్లు ఉన్నాయి వాటిలో ప్రత్యేక చికిత్స లభిస్తుంది. ●

---

## స హ గ మ నం

అపార ప్రభావం వుంది. అందుచేత విద్యావిహీనులైన తక్కువ తరగతులవారు వారిని కాదనలేక నమ్మేవారు.

"జంకు గొంకు లేని పురోహితులు ఎంత ఘోరమైనా చేయగలరనుటకు భార్య పతితో సహగమనం చేయాలనే నియమమే ప్రబల నిదర్శనమని" మాక్సు ముల్లరు చెప్పారు.

"భర్త విహీనయైన స్త్రీని పోషించే ఆర్థిక భారాన్ని తప్పించుకోడానికి లోభులైన బంధువులు పన్నిన పన్నాగ"మని రామమోహన్‌రాయ్ ఉద్ఘాటించారు. "అది ప్రేమతో భార్యచేసే ఆత్మత్యాగము, సాహసకార్యము అయితే పురుషుడెందుకు చేయడని?" ఆయన ప్రశ్నించారు.

ఎన్ని చెప్పినా ఈ ఆచారం హిందూ సంఘంలో వ్రేళ్ళు పాతుకుపోయింది. దీనిని వ్రేళ్ళతో పెకలించిన వాడు బెంటింకు ప్రభువు. ఆ మహాప్రభువు 1829 డిశంబరు 4న చేసిన శాసనమిది.

"ఈ నిబంధన అమలులోనికి వచ్చినది మొదలు హిందూ వితంతువు దహనానికి, సజీవ సమాధికి సహకరించిన, లేక ప్రోత్సహించిన నేరం మోపబడిన మనుషులందరు — ఆత్మత్యాగం చేసిన స్త్రీ తన యిష్టంతోనే చేసిందా? లేక బలవంతంగా చేసిందా అనే ప్రసక్తిలేకుండా — కావాలనే హత్య చేసిన దోషులుగా పరిగణింపబడి శిక్షార్హులవుతారు. వారికి జరిమానా లేక ఖైదు లేక రెండు శిక్షలు విధిస్తారు!"

బెంటింకు ప్రభువు డైరీలో వ్రాసుకున్న ఈ వాక్యాలు చదవండి —

"అధికారం చేతులోవుండి ప్రతి సంవత్సరం చనిపోతున్న అమాయకులైన వందలాది స్త్రీలను కాపాడలేకపోతే ఏ అంతరాత్మ ఒప్పుకుంటుంది? ఇప్పటిక ఒక్కరోజు ఆలస్యం చేసినా చనిపోయేవారి సంఖ్య పెరుగుతుంది. ప్రస్తుతం చేయబోయే పనిని ఒక్కరోజు ముందుగా చేస్తే కొన్ని చావులను ఆపవచ్చు గదా!"

ఇది శాసనం చేసేనాటి ఆ మహనీయుని మనస్థితి. భారత ప్రభుత్వం, రాజస్థాన్ ప్రభుత్వం ఇటీవల రాజస్థాన్లో జరిగిన సహగమనాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించాలి ఆంగ్లేయ ప్రభువైన బెంటింకుకున్న చిత్తక్షోభ వీరికిలేదు. రాజస్థాన్లో జరిగిన సహగమన వుత్సవాలకు రాజకీయ నాయకులు కూడా వెళ్ళారుట ఇదిఎంత అవమానకర విషయము?

ఈ రోజు రాజస్థాన్లో జరిగింది రేపు ఆంధ్రప్రదేశ్లో జరగవచ్చు కావున సహగమన దురాచారాన్ని మరల పురుషులు ప్రవేశపెట్టకుండా స్త్రీలు త్వరపడాలి. స్త్రీల సంఘాలు, స్త్రీల పత్రికలు ఈ ఆచారాన్ని తీవ్రంగా ఖండించాలి ఆధునిక స్త్రీలు దీన్ని అరికట్టకపోతే మళ్లీ ప్రతి స్త్రీ అగ్నిగుండంలో దూకాలిసిన భయంకర పరిస్థితి ఏర్పడుతుంది.

సహగమనాన్ని ప్రోత్సహించిన బంధువులను, పురోహితులను, దానికి సంబంధించిన ఇతరులను కఠినంగా శిక్షించే శాసనమొకటి చేసి, అమలు పరచాలిసిన బాధ్యత భారత ప్రభుత్వానికున్నది. ★

# అసలైన, సిసలైన

# గ్లూకోన్-డి ⓣ

## ఒక్కటే. దానిని తయారు చేయువారు గ్లాక్సో.

మీకు పరిచయమైన
ఆకుపచ్చ ప్యాకెట్ పై తెలుపు
అక్షరాల్లో వున్న గ్లూకోన్-డి ⓣ
కోసం చూడండి.




చౌకబారు నకిలీ సరుకుల్ని కొని మోసపోకండి అది మీ కుటుంబ ఆరోగ్యానికే హానికరం, అందుకే గ్లాక్సో వారి అసలైన గ్లూకోన్–డినే కొనండి. గ్లాక్సో వారి గ్లూకోన్–డి, శుద్ధమైన గ్లూకోజ్ పౌడర్‌తో పాటు విటమిన్ డి–౨, భాస్వరం మరియు కాల్షియంలతో బలపరచబడిన నమ్మకమైన ఉత్పాదన,

కోట్లాది ప్రజలు వాడతారు దీన్ని—అవసరమైనప్పుడల్లా శక్తి కోసం.

గ్లూకోన్–డి రకరకాల ఆహార పదార్థాలకు, ప్రాణ రక్షణకు వాడే ఔషధాలకు, మందులకు పేరెన్నికగన్న గ్లాక్సో కంపెనీచే తయారుచేయబడుతోంది.

మీరు కొనే గ్లూకోన్–డి ప్యాకెట్ అసలైనదే అని నిర్ధారణ చేసుకోండి.

## గ్లూకోన్-డి ⓣ తిరిగి శక్తి నిచ్చేందుకు నమ్మకమైనది.

ⓣ ట్రేడ్ మార్క్

HTB-GLL-7027-TC





# నైజం

రావినూతల సువర్ణాకన్నన్

జోరున వర్షం పడుతోంది. అప్పుడప్పుడు మెరిసే మెరుపుల కాంతి తప్ప అంతా అంధకారంగా ఉంది. రాత్రి పది గంటలు దాటకపోయినా వర్షం మూలాన వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి.

డాబాలమీద నుంచి, పెంకుటిళ్ళమీద నుంచి ధారగా ప్రవహిస్తున్న నీళ్ళు జలపాతాలను గుర్తుచేస్తున్నాయి. పక్కభాగంలోని వారాలి కుర్రాడు చిమ్నీ వెలుగులో చదవడానికి అవస్థపడుతున్నాడు.

వానకి తడిసి చలితో ఒణికిపోతూ వరండాలో ఓమూల ముడుచుకు పడుకున్న ఊరకుక్క మధ్య మధ్య మొర ఎత్తి ఏడుస్తోంది.

"ఛీ ఛీ! వెధవ కుక్క!" అంటూ దాన్ని తరవడానికి ప్రయత్నించి విఫలుడైన వారాలి కుర్రాడు తిట్టుకుంటూ తిరిగి పుస్తకం చేతిలోనికి తీసుకున్నాడు.

ఆ కుక్కపాటి ఆశ్రయం దొరకని ఒక గుడ్డి ముష్టివాడు, వానని తనలో రగిలే ఆకలినీ తిట్టుకుంటూ ఓ గోనెపట్టా కప్పుకుని చెట్టుకింద ముడుచుకుని కూర్చున్నాడు. ఆ గోనెపట్టా అతన్ని వాననుంచి రక్షించలేదు సరిగదా మరీ తడిపేస్తోంది.

కనిపించని దేవుణ్ణీ, తనేనాడూ కళ్ళారా చూడని హాయిగా ఇళ్ళల్లో పడుకున్న మనుష్యుల్నీ బండ బూతులతో అర్చన చేస్తున్నాడు.

భయంకరమైన ఆర్తి ముమ్మూర్తులా కాళరాత్రిలా తోచింది సోమిదేవమ్మకి.

అంత హోరులోనూ భర్త మూలిగే మూలుగు భయంకరంగా వినిపిస్తోందామెకు. డాక్టరిచ్చిన నిద్ర మాత్రలు ఏమీ పనిచెయ్యనట్టు ఆయన మూలుగే చెప్తోంది.

మెల్లిగా లేచి బిందెలోనుంచి ఒక గ్లాసు మంచినీళ్ళు ముంచుకుని గడగడ తాగేసి, ఓసారి మూలిగే భర్తకేసి చూసి దీర్ఘంగా నిట్టూరుస్తూ మంచం మీదికి ఒరిగింది సోమిదేవమ్మ.

పడుకున్నా ఆమె కంటికి నిద్ర రాలేదు గానీ... ఆలోచనలు మాత్రం ఈగల్లా ముసిరేశాయి.

శాస్త్రిగారు ఒకప్పుడు బాగా బ్రతికినా ప్రస్తుతం మాత్రం సామాన్యులే.

పిల్లలు లేరు. ఒక ఆడపిల్లని పెంచి పెద్దచేసి పంపేశారు. అల్లుడికి కట్నకానుకల రూపేణా చాలా ముట్టజెప్పారు శాస్త్రిగారు. అవకాశవాది అయిన కూతురు కూడా రాబట్టగలిగినంత రాబట్టి మరీ వెళ్ళింది.

శాస్త్రిగారి బుద్ధిమాత్రం విషభాండం: ఆయనకి తగ్గ ఇల్లాలు సోమిదేవమ్మ. వారు బాగా ఉన్న రోజుల్లో ఈసడించని మనిషి లేరంటే అతిశయోక్తి ఏంత మాత్రం కాదు, అందర్నీ విదిలించి వదిలేసేవారు.

శాస్త్రిగారు సంవత్సరం కన్నా ఒక యింట్లో ఎక్కువ రోజులు ఉండేవాడుకాదు. స్తోమత వున్నా ఇల్లుకొనే ఉద్దేశంగానీ కట్టే ప్రయత్నంగానీ చెయ్యలేదు. కారణం, బుద్ధిగలవాడే అద్దెకుంటాడు, బుద్ధిలేనివాడే ఇల్లు కడతాడు—అనే భావన వారిలో జీర్ణించుకోవడమే!

ఒకసారి ఆయన ఓ ఇంటి మెయిన్ పోర్షన్‌లో అద్దెకుండేవాడు. అప్పుడే మేడమీద కాపురం వుంటున్న ఓ ముసలామె కన్ను మూసింది.

ఆవిడని కిందికి తీసుకురావాలంటే వీరి వీధి గుమ్మం ముందు మెట్లమీదుగా రావాలి.

## వైజం

ఏమైనాసరే మా గుమ్మం తొక్కడానికి వీల్లేదని నానా హంగామా చేశారా దంపతులు.

"అందరం ఏదో ఓ నాటికి పోవలసిన వాళ్ళమేనమ్మా! కాస్త ముందూ, వెనుకా! అంతే! పోయిన వాళ్ళకి కాస్త మర్యాదనిచ్చి కన్నీటితో సాగనంపటం మన కనీస కర్తవ్యం! కాదంటారా?" అన్న ఓ పెద్ద మనిషిని పట్టుకుని కొట్టినంత పని చేసింది సోమిదేవమ్మ.

ఆ సంఘటనతో చాలా మందికి వారంటే ఒక విధమైన అసహ్యం పుట్టింది

కాలక్రమేణా శాస్త్రిగారు ఆర్థికంగా చితికిపోయి పెద్ద ఇంటోంచి ఓ రెండు గదుల చిన్న పోర్షన్‌లోకి మారిపోయి, వున్నదంతా కేష్ రూపంగా మార్చి, బేంక్‌లో వేసుకుని, ఆ వచ్చే వడ్డీతో భారంగా కాలాన్ని నెట్టుకొస్తున్నాడు

మూలిగే నక్కమీద తాటిపండన్నట్టు, మూడు నెలల కితం శాస్త్రిగారికి భయంకరమయిన కేన్సర్ వ్యాధి ముదిరిపోయి మరీ బైట పడింది.

మతి పోయిన సోమిదేవమ్మ అల్లుణ్ణీ, కూతుర్నీ రమ్మని టెలిగ్రాం ఇప్పించింది, అవసాన కాలంలో కూతురి పంచ చేరదామని.

వాళ్ళు వెంటనే వచ్చినా "అక్కడ మా ఇల్లు చిన్నది, రోగి ఉండటానికి చాలదు ... ఏదైనా జరిగితే మాత్రం వెంటనే ఫోన్ చెయ్యి, నీ ముందు రెక్కలు కట్టుకుని మరీ వాలతాం"అనేసి మరికాసిని ధయిర్య వచనాలు పలికి తిరుగు రైల్లో వెళ్ళిపోయారు.

ఉసూరుమంది సోమిదేవమ్మ మనసు. వీంతో మందిని ఎన్నో విధాలా అర్థించింది. ఊళ్ళో ఉన్న బంధుజనంలో ఒక్కరు రాలేదు ఆవిడకి సహాయపడటానికి.

హాస్పటల్లో చేర్చినా నాలుగు రోజులు ఆ పరీక్షలు, ఈ పరీక్షలు చేసి గుంటూరో, రాయవెల్లూరో తీసుకుపొమ్మని పంపేశారు.

మంచంలో మూలుగుతున్న ముసలాయన్ని అలా ఉంచేసి, బైట తాళం వేసుకుని మందుల షాపుకెళ్ళి మందులు తెచ్చుకునే అరవయ్యేళ్ళ సోమిదేవమ్మని చూస్తూంటే కడుపు తరుక్కుపోయినట్టున్నా ఎవరూ ఆమెనాదుకొనడానికి ముందుకు రాలేదు. బహుశా ఆమెకది తగిన శిక్షగా భావించారేమో!

# ఖర్చులు తగ్గించుకొనేందుకు -
# సిఫార్సు ప్రకారం ఎరువులను వాడండి








**వర్షాధారపు జొన్నకు సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన చాలా లాభకరం.**

ఏ పంటకైనా ఎరువుల వాడకంద్వారా ఒక క్వింటాలు దిగుబడి కయ్యే ఖర్చును తగ్గించవచ్చు. వర్షాధారపు జొన్నకు, సిఫార్సు ప్రకారం ఎరువులను వాడిన, ఒక క్వింటాలు జొన్న పండించటానికి అయ్యే ఖర్చు క్రింద సూచించిన విధంగా తగ్గుతుంది:

| వర్షాధారపు జొన్నపంట | ఎరువులు వేయకపోతే | సిఫార్సు ప్రకారం ఎరువులు వేసినప్పుడు |
|---|---|---|
| ఎకరానికి సాగుబడి ఖర్చు | రూ. 350/-లు | రూ. 569/-లు |
| ఎకరానికి దిగుబడి | 3 క్వింటాళ్లు | 8 క్వింటాళ్లు |
| క్వింటాలుకు ఖర్చు | రూ 117/-లు | రూ 71/-లు |

పంట ఖర్చులు తగ్గించుకోవాలన్నా, హెచ్చు లాభాలు పొందాలన్నా సిఫార్సు ప్రకారం ఎరువులను వాడాలి. ఎరువుల వాడకంద్వారా పైరు బెట్ట పరిస్థితులను కూడా చాలావరకు తట్టుకొని, ఆశించిన ఫలితాన్నియిస్తుంది.

వర్షాధారపు జొన్న పంటకు-అనువైన ఎరువు విజయ్ 24-24-0. ఎకరానికి 50 కిలోల విజయ్ 24-24-0ను, 25 కిలోల విజయ్ యూరియాను కలిపి దుక్కిలో విత్తేటప్పుడు విత్తనానికి 5 సెం మీ. లోతుగాను, 5 సెం.మీ ప్రక్కగాను వేయండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది చిరునామా నుండి ఈ పంటకు సంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకోండి:

ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, శాంతినగర్,
హైదరాబాద్ 500 028






పైర్ల సరియైన పోషణకు
# విజయ్

| విజయ్ 24-24-0 ఎరువుల నిర్ణీత పరిమాణముల శాతం | |
|---|---|
| నత్రజని | 24 |
| భాస్వరం | 24 |
| పొటాష్ | 0 |
| కింపుడు పదార్థం (మెత్తటి ఇసుక లేక డాలమైట్) | 20 |

HTM-MFL-2790

శాస్త్రిగారి వ్యాధి సంగతి తెలిసిన మరుక్షణం మంచి ఇంటి యజమాని ఆంజనేయులు ఇల్లు ఖాళీ చెయ్యమని కూర్చున్నాడు. ప్రతిరోజూ వచ్చి ఓ సారి గుర్తు చేస్తూనే ఉన్నాడు.

సోమిదేవమ్మకేం పాలుపోక బాధతో మెలికలు తిరిగే భర్తనోసారి జాలిగా చూసి ఆయనకివ్వవలసిన మందు మాకులు ఇచ్చి ఇల్లు తాళం పెట్టి అద్దె ఇళ్ళకోసం బయలు దేరింది.

పేట పేట తిరిగి వాచిన కాళ్ళు చూసు కుంటూ, ఆయాసం వస్తే ఏ అరుగు మీదో కాసేపు చతికిలపడి తిరిగి వేటకోసం బయలు దేరేది.

కానీ ... ఎంత తిరిగినా ఎవరూ ఆమెకి ఇల్లు ఇవ్వడానికి సాహసించలేదు.

కారణం ... కేవలం వాళ మీదున్న అసహ్యం మాత్రమే కాదు చూస్తూ చూస్తూ ఒక మనిషి చావడం కోసం, ఇళ్ళెవరిస్తారు? ... అంతా తలా ఒక సానుభూతి వాక్యం పలికి మరీ పంపేసే వారు.

మూడురోజుల నుంచీ ఇంటాయన మరీ పీకల మీద కూర్చున్నాడు, ఇల్లు కాళీ చెయ్యమని.

* * *

భూమి అదిరేలా పెద్దగా ఉరిమి ఎక్కడో పిడుగు పడింది. ఆలోచనల్లో ఉన్న సోమిదేవమ్మ ఉల్కిపడి భర్తకేసి చూసింది. ఎప్పుడు నిద్ర పట్టిందో గానీ మంచి నిద్రలో వున్నాడాయన.

మెల్లగా కళ్ళు మూసుకుంది.

'టక టక' తలుపు చప్పుడైంది. ఎందుకో సోమిదేవమ్మ గుండె ఝల్లుమంది. మెల్లగా లేచి తలుపు తీసింది.

ఊహించినట్లే ఇంటాయన యముళ్ళా నిల్చుని ఉన్నాడు. ఓ సారి భర్త కేసి చూసి ముందు గదిలోకొచ్చి తలుపు లాగింది ఆయనకి వినిపించ కూడదన్నట్టు.

"ఏమిటి బాబూ! ఇంత వానలో?" అంది, విషయం తెలిసినా తెలియనట్టు.

"ఏముందమ్మా! మీకు తెలియని దేముంది? మళ్ళీ పొద్దున్నే నేను ఊరు పోవాలి. అందుకే ఇప్పుడొచ్చాను" అన్నాడు విషయంలో కొస్తూ.

"బాబూ...ఇళ్ళెక్కడా దొరకలేదండీ..."

## నైజం

అంది సోమిదేవమ్మ గద్గద స్వరంతో.

"బావుంది! దొరక్కపోతే నేనేం చెయ్యను? మూణ్ణెల్ల నుంచీ చెప్తున్నాను. నాదీ పదిమంది గల కుటుంబం. పది కాసరాలున్న ఇల్లు, అదె లమీద బతికేవాణ్ణి. హటాత్తుగా ఇల్లు పాడు పెడితే నా గతేం గాను?' అన్నాడాయన నిక్కచ్చిగా.

సోమిదేవమ్మ ఒణికి పోయింది.

"లేదు...బాబూ.. అలాంటి సమయంలో ...ఇంటో ఉంచను!..." దుఃఖాన్ని అణిచి పెడుతూ అంది.

"అలా కాదమ్మా! కాస్త నన్ను కూడా అర్థం చేసుకోండి. వాన రాకడ, ప్రాణి పోకడ ఎవరు మాత్రం చెప్పగలరు? పూరి వీఁడా మీ బంధు జనం కావల్సినంత మంది



యూరేకా!

ఏదో ప్లస్ మరేదో
మైనస్ ఇంకేదో ఇంటూ
మరింకేదో డివైడెడ్ బై
అదేదో ఈజీక్వల్టు
శాంతి!

– కేఎస్వీ

ఉన్నారు. దగ్గర్లో మీ కూతురూ వుంది. ఎక్కడోక్కడ చూసుకోవాలి గానీ ... ఇలా నా పీకలమీదికి తెస్తే ఎలా? ఇదే ఆఖరుసారి చెప్పడం. ఆ తరువాత నన్ను నిందించి ప్రయోజనంలేదు" ఖరాఖండిగా చెప్పినెళ్ళాడు ఆంజనేయులు.

సోమిదేవమ్మ అలా నిల్చుండి పోయింది. ఆమెకి ఏడుపు కూడా రావడంలేదు.

"ఎలా? ... ఇప్పుడెక్కడికెళ్ళాలి? ఈ పరిస్థితుల్లో తమకి ఇలె వరిస్తారు? అయిన వాళందరితో పాటు కూతురు కూడా ముఖం చాటేసింది. వీడు చూస్తే రేపు ఇలు ఖాళీ చెయ్యకపోతే చెంబూ, తప్పేలా వీధిలో పారేసేలా ఉన్నాడు. వాడంతటివాడే కూడా."

"అమ్మగారూ!"

ఉల్కి పడింది సోమిదేవమ్మ.

ఆ వీధిలో పొరుగమ్మకునే పున్నమ్మ గొంతది

"ఎవరూ...పున్నమ్మా?"

"అవునమ్మా! నేనే!" అంటూ లోని కొచ్చింది పున్నమ్మ

"ఏమిటి పున్నమ్మా...ఈసమయంలో... నువ్వు..."

"ఏం చెయ్యనమ్మా! సాయంత్రమనగా ఆంజనేయులు బాబుగారి దగ్గర డబ్బు పటి కెడదామని వచ్చి, వాన మూలంగా ఇక్కడ చిక్కడి పోయా... మా వోళ్ళు ఎంత కంగారు పడుతున్నారో ఏఁవోఁ..." అంది పున్నమ్మ

"కూర్చో... పున్నమ్మా..." అంది సోమిదేవమ్మ.

"బాబుగోరు తఁవర్ని ఇల్లు ఖాళీ చెయ్య మన్నట్టున్నారు" అంది పున్నమ్మ ఓమూలగా చతికిల పడుతూ

"అవును పున్నమ్మా! ఏం చెయ్యాలో అర్థం కావటం లేదు... ఎక్కిన గడప ఎక్కకుండా అన్ని గడపలూ ఎక్కి యాచించాను, కాస్త నీడ ఇమ్మని ప్చ్.హూఁ! ఎవ్వరూ ఇవ్వలేదు ఇప్పుడీయన పీకలమీద కూర్చున్నాడు" దుఃఖంతో ఆవిడకి మాట పెగలటం లేదు.

"ఇన్నాను... అంతా ఇన్నాను! . ఆ బాబు గారు అంత అన్యాయంగా మాటాడతంటే ఎవరు సెప్పగ్గలు! కట్టానికో ఇల్లు, సుకానికో ఇలూ నా? బిడ్డా పాపా గలవోడు ఆయనే ఇలా మాటాడితే ఇంక బూమ్మీద బతికేదెట్టా? మనం సేసే సమ్మ నరుడూ, నారాయణుడు మెచ్చద్దూ?" అందిపున్నమ్మ ఆవేశం, బాధా మిళితమైన కంఠంతో.

"నిజమేపున్నమ్మా!...కానీ..ఇల్లాయనది. సొమ్మంటే పోక తప్పదు కదా! నా కర్మ ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుతుంది! ఆ రోజుల్లోనే నాది అన్న ఓ గుడిశ ఏర్పరచు కుంటే ఈనాడు ఇంత అగచాట్లు పడాల్సిన అవసరం వుండేది కాదు... కానీ!... ఏం చేస్తాం" అంది సోమిదేవమ్మ బాధగా.

"మీరుండండమ్మా! లోకం గొడ్డు పోలేదు. మనకి బగమంతుడి సాయం ఉండనే ఉంటది. మీ కబ్బెంతరంలేకుంటే నా ఇంటికి రండి! మీకు తెలుసుగా నాకో ఇల్లుంది, అది అద్దెలకిస్తానే! అందులో ఓ బాగం కాళీగా ఉంది, మా వోళ్ళెవరో అడిగితే ఉంచాను"

## నైజం

అంటున్న పున్నమ్మకేసి విభ్రాంతిపోయి చూసింది సోమిదేవమ్మ.

"ఏంటమ్మా! మా ఇంటికి రావటానికి సందేహిస్తున్నారా? మేవు తప్ప మిగతా అందరూ మీవోళ్ళే! పెద్దలిచ్చిన కొంపలు మావోళ్ళంతా అమ్ముకున్నా నేనమ్మనేదు.

ఏదో పది గొడ్లు పెట్టుకుని పాలు, పెరుగు అమ్ముకుంటూ, ఆ ఇల్లు కొంత అద్దెకిచ్చి, అలా ఆయిగా బతికేస్తున్నా! నా బిడ్డలూ మంచోళ్ళే కనక అంతబాద నేదు... అందుకే దయిర్యం సేసె మిమ్మల్ని రమ్మంటున్నా... మీ కట్టెంతరం..."

"ఛ ఛ! అదికాదు పున్నమ్మా! నీ సహాయం లభిస్తోందే అన్న సంతోషంతో మాట రాలేదంతే! నీలాంటి వాళ్ళ ఉండబట్టే లోకం ఇంకా నిలిచి వుంది! నీ కెలా కృతజ్ఞతలు చెప్పకోవాలో అర్థం కావటం లేదు" అంది సోమిదేవమ్మ పున్నమ్మ కేసి కృతజ్ఞతగా చూస్తూ.

ఏటిలో కొట్టుకుపోతున్న ఆమెకి పున్నమ్మ సహాయం పూల పడవలా తోచింది. పున్నమ్మలో దేవత కనిపించింది. "కలిమేదైతేనేం? మనసు దొడ్డది!" అనుకుని మనసులోనే ఆమెకి నమస్కరించింది సోమిదేవమ్మ.

* * *

మర్నాడు ఉదయానికలా వాన పూర్తిగా తగ్గిపోయింది. పున్నమ్మ సహాయంతో శాస్త్రిగార్ని ఆమె యింటికి చేర్చి హాయిగా నిట్టూర్చింది సోమిదేవమ్మ.

కేవలం చావుకి ఇలు ఇచ్చిన పున్నమ్మని పిచ్చిదానిలా చూశారంతా. కోడళ్ళు తిట్టి పోశారు కొడుకులు గొణుక్కున్నారు.

అందరి మాటలకీ చల్లగా నవ్విందే తప్ప మారు మాట చెప్పలేదు పున్నమ్మ.

* * *

పున్నమ్మ ఇంట్లోకెళ్ళిన నెల్లాళ్ళకలా, శాస్త్రిగారు యమయాతనలన్నీ అక్కడే అనుభవించి పై లోకానికి తరలిపోయాడు.

పదిహేను రోజులు గడిచిపోయాయి. దూరానవున్న ఏ తమ్ముడో కర్మకాండలన్నీ యథావిధిగా పూర్తి చేయించి కూతురితో సహా చుట్టపక్కాలంతా వెళిపోయారు.

ఆ రోజు సోమిదేవమ్మ మూటా, ముల్లె హడావిడిగా కడుతుంటే పున్నమ్మ చూసి—

"ఏంటమ్మగోరూ సామాన్లు సర్దుతున్నారు?" అంది లోనికొస్తూ.

"మరేం లేదు పున్నమ్మా! మావాళ్ళింటి దగ్గర ఓ మంచి పోర్షన్ ఖాళీ అయిందిట. ఇదిగో మా మేనకోడలు వచ్చి చెప్పింది. అడ్వాన్సు కూడా ఇచ్చేసి, ఈ రోజు మంచిది కదా అని నన్ను తీసికెళదానికొచ్చింది. ఇదిగో అన్నీ సర్దేశాక పిల్చి చెప్దామను

## 14 5 1982 శుక్రవారం మొదల్కొ 20 5-1982 గురువారం వరకు




★మేషం : వ్యాపారంలో మీకుగల శ్రద్ధ వలన, మంచి ఆదాయంలభించును. ఒకానొక విషయంలో సాయపడే మిత్రుల వలన సానుకూలం కానున్నది. కళా రంగంలో, కొందరకు ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు అధికారుల ఆదరణ లభిస్తుంది.

★వృషభం: ఒకానొక వారంలో మీకు సానుకూల పడని కుటుంబ వ్యవహారం, ఈ వారం నెరవేరే ఉపాయమున్నది. మీ శ్రద్ధాసక్తుల వలన వ్యాపార వ్యవహారాలు, ఆనందదాయకంగా నెరవేరగల వారం. స్త్రీలకు: శుభకార్యానుకూలత,కొందరకు ఉద్యోగావకాశాలు లభిస్తాయి.

★మిథునం: మీకు సంతాన మూలమైనయిబ్బం దులుంటాయి. విద్యాభివృద్ధిని గూర్చి, వారి పురోభివృద్ధిని గూర్చి ఏవో ప్రయత్నాలు చేయను న్నారు. రాజకీయ వాదులు, ఈ రాశి వారైన మేలు చేకూరుతుంది. స్త్రీలకు:ఏ విధంగా చూచినా మేలుండదు. ఆరోగ్యం బాగా చూచు కోవాలి.

★కర్కాటకం చాలమందికి శుభవార్తా శ్రవణం రాజకీయంగా అనుకూలత చేకూరటం, క్రీడారంగా వకాశాలు లభించటం, ఒకానొక చిన్న 'రోడ్డు' ప్రమాదం తప్పటం గమనింపదగిన అంశాలు. స్త్రీలకు: ఆదాయంలో అభివృద్ధి చెప్పదగిన వారమే.

★సింహం: మేలుకోరిన వారో, మిత్రవర్గమో, కావలసిన వారో యింటికిరానున్నారు. మీరుకొను గోలు చేయదలచు వ్యవహారాలలో జోక్యం కలి గించుకోగలరు. స్త్రీలకు: నూతన విషయ సేకరణకు, ధనలబ్ధికి అవకాశం గల వారం.

★కన్య: కొందరకు నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కానున్నది కొందరకు విదేశ ప్రయా ణం ఏదో విధంగా సమకూరే వారం. సభాకార్య క్రమంలో కొందరు జోక్యం కలుగ జేసికొన గలరు. స్త్రీలకు: సుఖశాంతులు,ధనలబ్ధి, గౌర వం యిత్యాదులకు అవకాశం గల వారం ఈ వారం.

★తుల : ఆదాయనికి, వ్యాపారానుకూలతకు, నూతన ప్రయత్నాలకు ఎంతశ్రద్ధతోయత్నించినా లాభించని వారం. నూతన విధాన కొందరకు గౌరవ లబ్ధి గల వారం. రాజకీయ వాదులకు ఆశా భంగం. స్త్రీలకు : ముఖ్యరంగాలలో అవకాశ ములు, సల్పాధాయం గల వారం.

★వృశ్చికం: మీ వ్యాపారం ప్రశాంతంగా సాగి పోయే వారం. మీకు బంధు మిత్రపరివార మూలక మైన గౌరవం సమకూడుతుంది. మీయింట శుభ కార్య ప్రస్తావన చేకూరే వారం. స్త్రీలకు: నూతన వ్యవహారాలుతెలిసికొనటం, నూతన వ్యక్తు లతో పరిచయం ఏర్పడ గల వారం.

★ధనస్సు: బంధు విరోధానికి అవకాశం.స్వల్పంగా ఆదాయం, వ్యాపారంలో ప్రగతి, సభాగౌరవం. పోయిన వస్తువులు దొరుక గలవనేఆశ అంకురించే వార్తా శ్రవణం గల వారం. స్త్రీలకు: కుటుం బానందం, ఆర్థికంగా ప్రగతి లభించే వారమే.

★మకరం: దూర బంధువులు యింటికి రాను న్నారు. శుభ వార్తలను గూర్చి ముచ్చటించి, ఒక పర్యవసానానికి రాగలరు. సుఖానుభూతికి అవకాశ ముంటుంది. ఆదరణ లభించే మార్గముంటుంది. స్త్రీలకు: సుఖం, కుటుంబానందం, ఆదాయం, రావలసిన బాకీలుంటె వసూలు కాగల అవకాశం గల వారమే.

★కుంభం: గ్రహించండి. ఆర్థిక రంగంలో మీకు అడ్డంకులు రాగలవు. అడ్డు పడే వారుంటారు. అవసరమో, అనవసరమో, నూతన వ్యవహారాలు తెలిసి కొంటారు. రాజకీయవాదులకు మేలైన వారమే. స్త్రీలకు: ఉద్యోగంలో 'ప్రమోషన్' కు అవకాశం, స్వల్పంగా ఆదాయముంటుంది.

★మీనం: మీ ఆలోచనలు ఫలవంతం, మీ శ్రద్ధా సక్తులకు సత్ఫలితం, భూ విషయంగా యితరులతో ముచ్చటించటం, మేలైన సరకులను సేకరించటం, వారం లక్షణంగా భావించండి. స్త్రీలకు:యుక్త వయస్కులకు శుభం జరగటం, కొందరకు పత్రికా గౌరవం లభించటం విశేషం.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

---

కున్నాను. ఇంతలో నువ్వే వచ్చేశావ్! నీకు నిండా నూరేళ్ళాయుష్షు!'' గిన్నెలు గోనె సంచిలో వడేస్తూ అంది సోమిదేవమ్మ.

అప్పుడు చూసింది పున్నమ్మ పక్కనున్న ఆవిణ్ణి. ఆ షేవగోడలే. లంకంత సొంత కొంప ఉంచుకుని స్వయానా మేనత్త కష్టంలో ఒక గది ఇమ్మని బతిమాలితే నిర్మొహమాటంగా ఇవ్వనన్న మహా ఇల్లాలు!

మౌనంగా బైటకొచ్చేసింది పున్నమ్మ.

"ఏమిటలా! దానిముఖం అలా పెంకులా అయిపోయిందీ?'' వ్యంగ్యంగా అంది మేన కోడలు.

"ఆఁ. దానిబొంది! నేను శాశ్వతంగా దీనింట్లోనే ఉండిపోతాననుకుంటోంది. వింత బ్రాహ్మణ వీధైతే మాత్రం పక్కన మద మాంసాలు తినే అలగా జనాన్ని పెట్టుకుని అన్నమెలా తిను? నోట ముద్ద మింగుడు పడుతుందా? ఛీ! ఛీ!'' అసహ్యంగా ముఖం పెట్టి "ఇదుగో! అందులో మీ మామయ్య పోయిన నక్షత్రం కూడ మంచిది కాదు! ఆర్నెల్లు పాడెట్టాలి! బ్రాహ్మణ పుటక పుట్టి చూస్తూ చూస్తూ ఇంత ఈ కొంపలో ఎలా వుంటాం?''అంది రహస్యంగా సోమిదేవమ్మ.

"అవును! అదీ నిజమే! అయితే ఇంకా నెల పూర్తికాలేదు కదా, దానికి . నెల అద్దె ఇచ్చేస్తావా?'' అంది మేనకోడలు.

"అయ్యో! ఇవ్వద్దూ?... ఇవ్వకపోతే అది ఊరుకుంటుందా? వీధినపడి యాగీ చెయ్యదూ? అలగా జాతీ, అలగా బుద్ధులూను!... అయినా దాని ఋణం మన కెందుకు?'' పెద్ద వేదాంతిలా అంది సోమిదేవమ్మ.

వీధిలో నిల్చుని వీరి సంభాషణంతా విన్న పున్నమ్మ అదోలా నవ్వింది —

అది మామూలు నవ్వు కాదు!

లోకాన్నంతటినీ పూర్తిగా అవగాహన చేసుకుని, కురుక్షేత్ర రణరంగంలో పార్థునికి గీతోపదేశం చేసున్న శ్రీకృష్ణ పరమాత్మ పార్థుని అమాయకత్వానికి జాలిగా, బాధగా, కోపంగా ధర్మార్థాలూ గోచరించేలా నవ్విన నవ్వులా వుంది.

ఇంకాచెప్పాలంటే చిద్విలాసంగాఉంది.




ఎన్నో రోజుల తర్వాత భానుమతికి ఎంగా వేళ వింతో ఆనందంగా వుంది. మధ్యలో కరిగి పోయిన కలలు మళ్ళీ యిన్నాళ్ళకు కొత్త వూపిరి పోసుకోబోతున్నాయి. మనసులోని వుత్సాహం కాళ్ళలోకి ప్రవేశించినట్లు విక్సిలేటర్‌ను బలంగా నొక్కింది. తేలిగ్గా, వేగంగా దూసుకు పోతోంది కారు.

ఇక మళ్ళీ ఇన్నాళ్ళకు భార్గవ తనని చూస్తూనే పరుగునవచ్చి చేతుల్లో వాలిపోయి మెరిసే కళ్ళతో, నవ్వులూ కబుర్లు చెబుతాడు. ఓహ్, వూహాలోనే వింత మధురంగా వుందా దృశ్యం?

మళ్ళీ ఆ మధుర క్షణాలు తన జీవితంలో వస్తాయనుకోలేదు. తమ కోసమే అన్నట్లు రాము ఫారిన్ నుంచి ఇండియా వచ్చాడు. చిన్నప్పట్నుంచి రాముకి తనంటే పిచ్చి ఆకర్షణ. తనేం చెయ్యమన్నా చేస్తాడు. ప్రస్తుతం ఫారిన్ రిటర్న్‌డ్ కదా కొంచెం బడాయి చేర్చుకున్నట్లున్నాడు. భార్గవ సంగతి చెప్పి తనడిగిన దానికి చిన్నని చూసి చెబుతానన్నాడు. ఆ, అంతా పోజు చెయ్యకేం చేస్తాడు?

ఆ వ్యధ యిన్నాళ్లుగా అనుభవించిన తంపపు కోత నుంచి విముక్తి లభిస్తుంది. ఇక భార్గవ ఆట పాటలతో యిల్లు హోరెత్తి పోవాలి. అసలు భార్గవకి ఆట అంటే ఎంత వుత్సాహమో! ఒక్కనిమిషం ఒక్కచోట కదలకుండా కూర్చునేవాడు కాదు. పరుగులే కాని నడక తెలియదా! అన్నంత హుషారుగా వుండేవాడు. అలాంటిది ...

"ఓ" పెద్దగా రాబోయిన కేకను కష్టం మీద ఆపుకుంది. వరాతు పరుగు తీసింది. వేగంగా స్టీరింగ్‌ను పక్కకు తిప్పేసింది. రోడ్డు పక్కన నిలబెట్టిన తారు డబ్బాను గుద్దుకోబోయి ఆగింది కారు. ఎదురుగా స్పీడుగా వస్తున్న వేన్ దాదాపు కారును రాచుకుంటూ వెళిపోయింది.

జరగబోయిన ఏక్సిడెంట్‌ను వూహించి వూపిరి బిగపట్టి చూస్తున్న తను రోడ్డు ప్రమాదం తప్పినందుకు తేలిగ్గా నిట్టూర్చింది.

"థాంక్‌గాడ్" భానుమతి నుదుట పట్టిన చిరుచెమట గాలికి చల్లగా తోచింది. స్టీరింగ్‌ను పట్టుకున్న చేతులు బిగుసుకున్నాయి.

"మరొక్క నిముషం తాను పరాగ్గా వుండి వుంటే యీ పాటికి..." వూహించలేక పోయింది.

తనకేమున్నా అయితే భార్గవ నెవరు చూస్తారు ?

వింతలో తప్పింది ఏక్సిడెంట్! "ఏక్సిడెంట్" అన్న పదం మనసులోకి రాగానే భయంతో వెన్ను జలదరించినట్టయింది.

ఇలా ఏక్సిడెంట్‌తోనే కదూ తన భార్గవకి కళు పోయాయి! వాడి కళ్లల్లో చీకటి యిల్లంతా నిండిపోయింది. సంతోషానికీ, తెలివితేటలకూ ప్రతిరూపంలా వుండే భార్గవ మూర్తీభవించిన దైన్యంలా అయిపోయాడు. పదమూడేళ్ల పసివాడు విరాగిలా వుండిపోతుంటే ఎలా భరించటము ?

ఊహు, మళ్లీ వాడి కళ్లలోకి వెలుగు రావాలి, జీవితంలో ఒంటరిగా నిలిచిపోయిన తనకు ఆ కళ్ల వెలుగే జీవన సర్వస్వం. తన భార్గవ ఎప్పుడూ నవ్వుతూ ఆనందంగా వుండాలి అందుకోసం తనేమన్నా చేస్తుంది, అంతే!

మెత్తగా వచ్చిన కారు విశాలమైన గేటు దాటి పెద్ద భవంతి ముందు ఆగింది.

ఇంటిలోకి రాగానే హాల్లో తన కెదురొచ్చిన చిన్నిని చూడగానే చిరాగ్గా అనిపించింది భానుమతికి.

"లోకంలోని వెలుగంతా తన కళ్లలోనే దాచేసుకున్నట్టు యీ పిల్ల కళ్ళెందుకిలా మెరుస్తుంటాయి ?" అనుకుంది.

"ఎప్పుడూ ఎదురు నీ శని మొహమే రావాలా? వెళ్లవతలకి" గట్టిగా కసురుకుంది.

చిన్ని పెద్ద కళ్ళు రెప రెప లాడాయి: వెంటనే అక్కడ్నుంచి తప్పుకుంది భానుమతి విసురుగా మేడపై కెళ్ళిపోయింది.

"తనంటే అత్తయ్య కెందుకంత కోపం? తనేం తప్పు చెయ్యకపోయినా కనిపిస్తేనే చాలు మండిపడుతుంది. ఎప్పుడూ శని మొహమా అనో మగదెయ్యమా అనో పిలుస్తుంది" కళ్లల్లో నీళ్ళు తిరిగాయి. భానుమతి ఎప్పుడూ చిన్నిని కసురుకుంటూనే వుంటుంది. కానీ ఎప్పుడు కసిరినా అదే మొదటి సారయినట్టు ఏడుపొస్తుంది చిన్నికి. అది ఆత్మీయతకై తహ తహ లాడే మనసులో ఒంటరితనం కలిగించిన నిస్సహాయత.

"నువ్వెప్పుడూ దేనికీ ఏడవకూడదు చిన్నీ. ఏడ్చేవాళ్ళంటే నా కిష్టం వుండదు." భార్గవ ఓదార్పు గురుకొచ్చి కళ్ళు తుడుచుకుని తనకని వుద్దేశించిన మూల గదిలోకెళ్ళి కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది.

ఎదురు గదిలో భార్గవ దగ్గర కూర్చుని ఏవో కబుర్లు చెబుతూంది భానుమతి

భానుమతి భార్గవని దగ్గరకి తీసుకునే దృశ్యం ఎప్పుడూ అపురూపంగా ఉంటుంది చిన్నికి

"తననెవరూ అలా లాలనగా దగ్గరకితీసుకోరేం? తనెవ్వరికీ...ఎవ్వరికీ అక్కర్లేదా?" మాటాడలేని ఆ చిన్నారి హృదయంలో ఆ ప్రశ్నే ఓ ఆవేదనా కెరటమై ఎగసి పడుతూంటుంది నిశ్శబ్దంగా.

చిన్ని ఆ భవనం దాటి బయటకు వెళ్లే అవకాశమే లేదు. ఒంటరితనం అనే గాఢాంధకారంలో ఒకే ఒక చిరుదీపం భార్గవ. భానుమతి యింట్లో వుండగా భార్గవ దగ్గర కెళ్ళదు చిన్ని. భార్గవ చిన్నితో ఆడుకోకూడదు, మాట్లాడకూడదు. అదీ ఆమె ఆజ్ఞ!

*　　*　　*

మరునాడు భానుమతి బయటకువెళుతూ తనమా బయలుదేరమంటె బోలెడు ఆశ్చర్యం వేసింది చిన్నికి

"నిజంగానా?" అన్నట్లు చూస్తున్న చిన్నిని చూస్తే ఒక్క క్షణం జాలి కలిగింది భానుమతికి.

కానీ ఆ జాలి మనసులో నిండక మునుపే కోపమూ, కసీ, వచ్చేశాయి.

"దీని తల్లిమూలానే కదూ తన భర్త చచ్చిపోయిందీ? ఛీ, దిక్కుమాలిన వెంత, దీనిమూలానే ఈ యింటికి శని పట్టింది."

"నిన్నే, అలాచూస్తావేం కదులు" గట్టిగా గదిమింది.

తను కారులో వెళ బోతూందని భార్గవతో చెప్పిరావాలని గట్టిగా అనిపించింది చిన్నికి. "కానీ ఎలా? తను నోటితోచెప్పలేదు. సైగ చేస్తే అతను చూడలేడు, ప్చ్," దిగులుగా నిట్టూర్చి భానుమతిని అనుసరించింది.

ఈ పూట కూడా డ్రైవర్ని వద్దనిచెప్పి తనే కారు తాళాలు తీసుకుంది భానుమతి.

చిన్ని ఆమె పక్కన కూచునే సాహసం చేయక వెనుక కూమంది. కారు వేగంగా మెత్తగా పరుగులు తీస్తుంటే వెనక్కిపోతున్న పరిసరాలను యింతేసి కళ్ళతో చూస్తూ కూర్చుంది చిన్ని.

క్రమబద్ధంగా పెంచబడిన పూలతోట మధ్యలో అందంగా, ఆధునికంగా వున్న నేడ ముందాగింది కారు భానుమతి కారుదిగి నేరుగా లోపలికి దారి తీస్తుంటే పసుపు రంగు బోర్డుపై అందంగా పెయింట్ చేయబడిన అక్షరాలు డా. రామారావు వరకే చదివిన చిన్ని, పేరు పక్కనవున్న డిగ్రీలన్నీ చదువుతూ నిలుచుంటె అత్తయ్య తిడుతుందేమోనని తనూ ముందుకు నడిచింది.

అందరూ వెళ్ళిపోయిన తర్వాత చివరగా భానుమతి లోపలికి వెళ్ళింది. ఆరోజుకిక పేషంట్లెవరూ రారు. కళ్లద్దాలతో తెల్లగా హుందాగా వున్న వ్యక్తిని చనువుగా విష్ చేసింది.

"ఈ పాపేనా?" పదేళ్ల వయసులో అమాయకత్వం నిండిన మొహంతో, ముద్దుగా ఉన్న చిన్నివంక చూస్తూ అడిగాడు.

ఆయన తనవంక చూడగానే న్రమతగా చేతులు జోడించింది చిన్ని "నమస్తే" అన్నట్టు.

ప్రఖ్యాత కళ్ల డాక్టరు రామారావు చిన్ని కళ్లనుచూస్తూ "చాలా అందమైన కళ్ళు" అనుకోకుండా వుండలేక పోయాడు.

"భానుమతీ, కాసేపు బయట కూర్చుంటావా? నేను పాపని పరీక్షించిన తర్వాత..."

అతని మాటలు పూర్తి కాకమునుపే బయట కెళ్ళింది ఆమె.

డా. రామారావు తన పని తాను చూసుకుంటూనే చిన్నిని "పాపా, నీ పేరేమిటి?" మృదువుగా అడిగాడు.

# ఆ కళ్ళు

అమెరికాలో ఉండివచ్చిన అతనికి తియ్యని స్వరాల్లో తెలుగు వినాలంటే యిష్టం.

రామారావు ప్రశ్నకి మౌనంగా చూసింది చిన్నీ.

"ఏమిటిదంతా. అసలు అత్తయ్య తన నిక్కడకు ఎందుకు తీసుకొచ్చినట్టు? తన కేమయిందని డాక్టరు పరీక్షించటము?"

ఆలోచిస్తోంది.

రామారావు మళ్ళీ అడిగాడు. "చెప్పు పాపా? నీ పేరేంటి?"

ఒక్క క్షణం చూసి టేబిల్ పైనున్న పెన్నూ, పాడ్ తీసుకుని "చిన్నీ" అని, కింద "నాకు మాటలు రావు" అని రాసింది.

రామారావు తెల్లబోయాడు. క్రమంగా అతని కళ్ళల్లో ఆశ్చర్యమూ, తర్వాత కలవరమూ చోటు చేసుకున్నాయి.

"నీకు ... నీకు మాటలు రావా ?" నమ్మలేనట్టు వీలాగో అడిగాడు. చిన్నీ తల అడ్డంగా వూపింది, ఆ పెద్ద పెద్ద కళ్ళ నిండా అలా వూపుతుంటే చెప్పలేనంత దిగులు.

రామారావు కుర్చీలో కాసేపు తనూ మాటలు రాని వాడిలా నిస్తేజంగా కూరుచుండి పోయాడు.

తర్వాత మెల్లగా తేరుకున్నాడు. తన ముందు అందాల బొమ్మలా కూర్చుని వున్న చిన్నీని చూస్తుంటే ఎందుకో తెలియని అమిత వాత్సల్యం కలిగింది. ఆ పైని భానుమతి మీద అసహ్యం వేసింది తర్వాత ఆ అసహ్యం తన మీద తనకే కలగగా చిన్నీ వంక చూడలేక పొయ్యాడు.

"మూగ తనంతోనే దీనంగా వున్న యీ పాపకు, తను కళ్ళు కూడా దూరం చేస్తే ? ఛీ ఛీ ఆఖరకు యిందుకా తన చదువు, విజ్ఞానం వుపయోగ పడేది ?"

జీవన పోరాటంలో పై అంతస్థుని గెలుచుకోవాలన్న ప్రయత్నంలో ఏ నాడో అణగద్రొక్కబడిన మనసులో మానవత్వం మేలుకుంది.

"అసలు ఒకరి జీవితాన్ని చీకటి చేసి మరొకరి కళ్ళలో కాంతి నింపటము ఏం న్యాయము ? కళ్ళకి వెలుగు నివ్వటానికే తనకి అర్హత నిచ్చారు గానీ కంటి వెలుగుని ఆర్పే అధికారం ఎవరిచ్చారు ? తనెలా ఒప్పుకోవాలనుకున్నాడు ?

నో, తన వల్ల కాదు. తనీ రాక్షస కృత్యం చెయ్యలేడు. నోరు లేని పాప, కళ్ళ ద్వారా తన మనోభావాలు తెలుపుతుంటే తను కనుచూపునూ దూరం చేస్తే యిక యీ లోకంలో ఎలా బ్రతుకుతుంది ? ఆకలి తీరడమే ముఖ్యం అనుకునే యీ తోడేళ్ళ ప్రపంచంలో ఆడపిల్ల..." తలుచుకుంటేనే భయంకరంగా వుంది.

'నో నో'

ఉన్నట్టుండి అలా మౌనంగా అంతర్ముఖుడైనట్టు కూర్చుండి పోయిన రామారావు వంక వింతగా చూస్తోంది చిన్నీ

అతను ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా చటుక్కున లేచి భానుమతి కూర్చుని వున్న ముందు రూమ్‌లోకి వచ్చాడు.

"నేనీ ఆపరేషన్ చెయ్యను"

వూరికే మెడికల్ జర్నల్ చూస్తూ పేజీలు తిప్పుతున్న భానుమతి, వున్నట్టుండి అతనలా వచ్చి చెప్పటంతో ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటి నువ్వనేది ?"

"నువ్వు చెప్పిన పని నా వల్ల కాదు అంటున్నాను." తెచ్చిపెట్టుకున్న సహనం నశిస్తోంది అతనిలో.

"ఏం ? ఎందుకని ?"

"నేను రాక్షసుడ్ని కాదు కాబట్టి" కటువుగా అన్నాడు.

"నిన్నటిదాకా చేస్తూ వచ్చావుగా, యీరోజే మానవత్వం గుర్తొచ్చిందా ?" వెటకారంగా అడిగింది భానుమతి

"భానూ, మనిద్దరం ఒకే వూరిలో, పక్క పక్క యిళ్ళల్లో పెరిగాం, ఒకే స్కూల్లో చదువుకున్నాము. నువ్వెప్పుడూ నీ స్వార్థమే చూసుకుంటావని నాకు బాగా తెలుసు. కానీ ...కానీ ఆ స్వార్థం యింత రాక్షసంగా కూడా వుంటుందని మాత్రం అనుకోలేదు."

భానుమతి ఏదో అనబోయేంతలో ఆమెకు అవకాశం యివ్వకుండా ఆవేశంగా అన్నాడు. "ఎవ్వరికీ అక్కర్లేని, కొద్ది రోజుల్లో చనిపోబోయే పిల్ల అన్నావు. కానీ ఆ పాప చక్కగా ఆరోగ్యం కలదే! ఆ కళ్ళలోనే వుందా అమ్మాయి భవిష్యత్తంతా. మూగతనం జీవితంలో సాధించబోయే అభివృద్ధికి ఆటంక మెంత మాత్రం కాదు. ఆ చిన్నారి మనసులో ఎన్ని ఆశలు వున్నాయో"

"హు, ఆశలు. భవిష్యత్తు! దానితో పనికొచ్చే వల్లా ఆ కళ్లే అందుకే ఆ కళ్ళు నాక్కావాలి"

"కళ్ళు మాత్రం ఏం ఖర్మ, నోరెలానూ లేదు కళ్ళు తీసుకునే కన్నా ప్రాణాలు తీసేస్తే పోతుందిగా!"

రామారావు అలా మాటాడటంతో పిచ్చెక్కినట్లు వుంది భానుమతికి కసిగా అన్నది- "కళ్ళు పోతే ఎలాగూ అదే ఎక్కడో, ఏ గోతిలోనో పడి ఛస్తుంది!"

"భానూ" అరిచాడు రామారావు "నువ్వసలు స్త్రీవేనా? ఎందుకు నీకా పసిపిల్లపై అంత కక్ష?"

అంతవరకు తెగించినట్లు మాటాడిన భానుమతికి అతను తనవైపు చూసిన చూపులో ద్వేషమూ, అసహ్యమూ తోచి మనసు చివుక్కుమంది

"ఎందుకా? దాని శనిపాదంతో నా జీవితం సర్వనాశనమైంది కనుక"

"ఎవరి దురదృష్టానికి ఎవరు బాధ్యులు? చిన్నీ వల్ల నీకేం అపకారం కలిగింది?"

"అంతా అపకారమే, నీకు తెలియదు రామూ, చిన్నీ తల్లి విజయ మా వారికి ఒక్కగానొక్క ముద్దుల చెల్లెలు కాపురానికి వెళ్ళినప్పట్నుంచీ నాకు శత్రువులానే వుండేది. ఒక్కసారైనా నా భర్తతో ఏకాంతంగా ఎక్కడికీ వెళ్లేందుకు కుదిరేది కాదు. నిద్రించేటప్పుడు తప్ప ఆయన చెల్లెల్ని ఒక్క క్షణం వదిలేవారు కాదు. అదెక్కడి ప్రేమో!?

నా కసూయ అంటావేమో, నిజానికి అసూయ అన్నది ఎప్పుడు పుడుతుంది? కనీస కోరికలు కూడా మనకి తీరక అవతలి వారు ఆడింది ఆట పాడింది పాటగా వున్నప్పుడు.

ఆవిడ మా గుమాస్తాని ప్రేమించి పెళ్ళి కాకుండానే తల్లి కాబోతే మా వారు విషయం తెలుసుకుని గుట్టు రట్టు కాకుండా పెళ్ళి జరిపించేసారు. పెళ్లి చేసినా విజయ మా దగ్గరే వుండేది. చిన్నీ పుట్టి రెండేళ్ళయినా తిరక్కముందే ఒకనాడు విజయ స్టవ్ వెలిగించబోయి గాస్ అంటుకుని మంటల్లో చిక్కుకుంది. సమయానికి యింట్లోనే వున్న మా వారు చెల్లెల్ని రక్షించబోయి తామూ కాలిపోయ్యారు. స్నానం చేస్తున్న నేను బాత్‌రూమ్‌లోంచి వచ్చేసరికి అంతా అయి

పోయింది. చిన్ని కళ్ళంటే మా వారి కెంతో యిష్టము. ప్రాణాలు వదులుతూ నా దగ్గర మాట తీసుకున్నారు– చిన్ని నిప్పుడూ, దేనికీ కంటతడి పెట్ట కూడదనీ, చిన్ని బాధ్యత నాదేననీ. ఎందుకంటే విజయ భర్త వ్యసన పరుడు. 'అతనెటూ చిన్నిని చూసుకోడని తెలుసు. బాధ్యతారహితంగా వుంటే అతని ప్రవర్తనకి కోపం వచ్చి ఓ రోజు నేను గట్టిగా అరిచేసరికి చేతికందినంత డబ్బుతో యింట్లోంచి పారిపొయ్యాడు. ఏమయ్యాడో యింతవరకూ తెలియదు.

మా వారు కన్నకొడుకు కన్నా, చిన్నినే ఎక్కువ గారాబం చేసేవారు. ఆయన కిచ్చిన మాట కోసం దీన్ని యిన్నిరోజులు పెంచాను. కానీ యిది దురదృష్టానికి ప్రతిరూపం. ఇదింట్లో వున్నంత కాలం ఏదో ఒక ప్రమాదం జరుగుతునే వుంటుంది.

నాకు మిగిలిన ఆశ నా బాబు భార్గవ. వాడి కోసమే నేను బ్రతుకుతున్నాను. అయితే స్కూల్ బస్‌కి ఏక్సిడెంట్ అయి భార్గవకి కళ్ళు పోయాయి. అసలు మా జీవితాలకు దీని రూపంతోనే శని పట్టింది ఆయన కోరిక ప్రకారం దీని కళ్ళకు కన్నీళ్ళు రానివ్వను. ఆ కళ్ళు నా భార్గవకి యిస్తే అప్పుడిక ఆ కళ్ళకు కన్నీళ్ళ ప్రసక్తే వుండదు. ఆ మూగ దెయ్యం చావనీ, రామూ నువ్వెలాగైనా యీ ఆపరేషన్ చెయ్యాలి. నా కోసం. నా భార్గవ కోసం''

ఆవేశంగా మొదలు పెట్టిన భానుమతి జాలిగా ఏడుస్తోంది.

# ఆ కళ్ళు

ఇది స్వార్థమా ? ద్వేషమా ?

పసిపాపపై ఆమె పెంచుకున్న కసికి కోపపడాలో, జాలిపడాలో అర్థం కాలేదు రామారావుకి.

ఇది కర్మభూమి. ఇక్కడి మనుషులు జీవితంలోని మలుపులకి అదృష్ట దురదృష్టాలని చెప్పి వేళావిశేషాలకూ, తమ చుట్టూ వున్న వ్యక్తులకూ ముడిపెట్టి ప్రేమనో, ద్వేషాన్నో పెంచుకుంటూంటారు.

ఈ మనస్తత్వాలు ఎలా మారుతాయి ?

నిశ్శబ్దంగా వున్న పరిసరాలు భానుమతి ఏడుపును నిస్సహాయంగా చూస్తున్నాయి.

"చిన్ని ఏం చేస్తోంది ? తను మాటలన్నీ విన్నదా ?" గబుక్కున వచ్చిన ఆలోచనతో రామారావు లోపలికి చూసాడు.

అంతవరకూ గుమ్మంలో బొమ్మలా నిలబడి వున్న చిన్ని గిరుక్కున లోపలికెళ్ళింది.

బాధలు వయసును ఎక్కువ చేస్తాయి. వయసును మించి మనసుకు వూహలు నేర్పుతాయి. ఆ పాప ఏం ఆలోచిస్తోందో? ఊహించని విధంగా రెండు నిముషాల తర్వాత గదిలోంచి చేతిలో కాగితంతో వాళ్ళిద్దరి మధ్యకు వచ్చింది చిన్ని. రామారావు చిన్ని తన చేతికిచ్చిన పేపర్ వంక చూసాడు.

అందులోని అక్షరాలుగుండ్రంగా, పెద్దవిగా వున్నాయి,

డాక్టరుగారూ,

దయచేసి అత్తయ్య చెబుతున్న దానికి ఒప్పుకోండి. నా వలన భార్గవకి మళ్ళీ చూపు వస్తుందంటే నాకు సంతోషంగా వుంది. నాకు అమ్మా, నాన్న ఎవ్వరూ గుర్తులేరు. నాతో మాట్లాడేది, ఆడుకునేది భార్గవ ఒక్కడే. ఇంకెవ్వరికీ నేను అక్కర లేదు, యిష్టంలేదు. నన్ను చూస్తూనే అందరూ కసురుకుంటూరు. నేను భార్గవ వల్లనే బ్రతుకుతున్నాను. 'అయితే కళ్ళు పోయినప్పట్నుంచీ భార్గవ నాతో మాట్లాడ లేక పోతున్నాడు. నేను మాటాడలేను కదా, సైగలు చేస్తే చూడలేడు. నేను చెప్పేదేం తెలుస్తుంది ? భార్గవకి చూపు వస్తుందంటే నేనేమయినా చేస్తాను."

పూర్తిగా చదివిన రామారావు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పెద్ద పెద్ద కళ్ళతో అమాయకంగా, బెదురుగా తన ఎదుట నిలిచివున్న చిన్నిని చూస్తే హృదయం ఆర్ద్రమయింది.

"పాపా" తన నడుము దాకా వస్తున్న చిన్ని తలని ఆప్యాయంగా నిమిరాడు.

భానుమతి అర్థం కాక ఏమిటన్నట్లు చూసింది.

డాక్టరుగారు తననలా దగ్గరకు తీసుకోవడంతో పాప కళ్ళు తేలిగ్గా, సంతోషంగా నవ్వాయి. రామారావుకి ఆ కళ్ళలో మమతా, మానవతా కలిసి నవ్వుతున్నట్లనిపించింది.

# హైదరాబాద్ నోట్‌బుక్

**తిరుమల రామచంద్ర**

**తెలుగుదేశం తొలి సమావేశం :**

తెలుగుదేశం పార్టీ తొలి సమావేశం ఏప్రిల్ 11న బాగానే ప్రారంభమయిందనవచ్చు. ఐదారేళ్లుగా ఏ బహిరంగసభకూ ఇంతమంది జనం రాలేదంటే అతిశయోక్తి కాదు. ముషిరాబాద్‌లోని రామకృష్ణా స్టూడియోస్ నుంచి ప్రారంభమై నల్లకుంట, కాచిగూడ, సుల్తాన్‌బజార్, అబిడ్‌ల మీదుగా నిజాం కళాశాల మైదానం వరకు సాగిన తెలుగుదేశం అభిమానుల వూరేగింపులోను జనం బాగానే ఉన్నారు. శ్రీ ఎన్. టి. ఆర్. రూపాయ నోట్ల దండ మెడలో వేసుకుని టాపు లేని జీపులో చేతులు జోడించి నిలబడి తన కోసం గంటల తరబడి వీధుల కిరుప్రక్కలా, మేడల మీదను వేచియున్న జనానికి అభివాదనలు చేశారు. శ్రీ ఎన్. టి. ఆర్. జీపుకు ముందు ఆయన కుమారుడు శ్రీ వంశీకృష్ణ మరొక జీపులో నిలబడి కెమెరాతో వూరేగింపు దృశ్యాలను చిత్రీకరించారు. రాష్ట్రంలోని అన్ని జిల్లాల నుంచి లారీలలో జనం వచ్చి వూరేగింపులో పాల్గొన్నారు. ఈ మహాసభ ప్రారంభానికి ముందు పెద్ద ఎత్తున బాణాసంచా కాల్చారు. సభాంగణానికి అల్లూరి సీతారామరాజు ఆవరణ అని పేరు పెట్టారు. వెనుకటి రోజున వర్షం కురవడం వల్ల భారీ షామియానాపూర్తిగా తడిసిపోయినా జనం ఓర్చుకుని కూర్చున్నారు. శ్రీయుతులు ఎన్. టి రామారావు, పార్టీ సారథ్య సంఘ సభ్యుడు నాదెండ్ల భాస్కరరావు, ఎం. ఆదెయ్య, పి. నారాయణ, జి. వి. రత్నయ్య, వసంత నాగేశ్వరరావు, మహిపాల్ రెడ్డి, కృష్ణమూర్తి, ఎల మంచిలి శివాజీ, కోటేశ్వరరావు,నరసింహులు, విటల్ రావు, కట్టా సుబ్బారావు ముస్నగువారు తమ పార్టీ ఆశయాలను వివరించారు. తెలుగు జాతి తలయెత్తుకుని తిరిగేటట్లు చేయడం తమ పార్టీ లక్ష్యమని అన్నారు. ఉదయం జరిగిన ప్రతినిధుల సమావేశంలో తెలుగు ప్రజల న్యాయమైన వాంఛితాలను సఫలీకృతం చేయడం, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను సుస్థిరపరచడం, అవినీతి భయాన్ని నిర్మూలించి, ప్రజలకు స్వేచ్ఛాయుత జీవితం అందించడం తమ పార్టీ ఉద్దేశమని ఈ సమావేశంలో తీర్మానించారు.

**అంబేద్కర్ జయంతి— ఊరేగింపు పై లాఠీచార్జి :**

ఏప్రిల్ 14వ తేదీన అంబేద్కర్ 91వ జయంతి సందర్భంగా సుల్తాన్‌బజారులోని గాంధీ జ్ఞాన మందిర్ నుంచి బయలుదేరిన భారతీయ జనతా పార్టీ కార్యకర్తల వూరేగింపును టాంక్‌బండ్ వద్ద ఉన్న అంబేద్కర్ విగ్రహం వద్దకు వెళ్ళకుండా అబిడ్సు వద్దనే పోలీసులు అరికట్టి లాఠీ చార్జి, బాష్పవాయువు ప్రయోగించడం వల్ల శ్రీయుతులు బంగారు లక్ష్మణ్, వెంకయ్య నాయుడు ముస్నగువారికి గాయాలు తగిలాయి. వారిని అరెస్టు కూడా చేశారు. దాదాపు 400 మందిని పోలీసులు అరెస్టు చేశారని, బి జె.పి నాయకులు ఒక ప్రకటనలో విమర్శించారు. టాంక్‌బండ్ పార్కులో బి.జె. పి. సభ కోసం వేసిన షామియానాలు నిర్మానుష్యంగా వెలవెల బోయాయి. వూరేగింపులో పాల్గొన్నవారు హరిజనులపై అత్యాచారాలు అరికట్టాలని, అంబేద్కర్ యువజనసంఘం హరిజనుల మీద అత్యాచారాలకు వ్యతిరేకంగా జనవరి 26న జరిపిన వూరేగింపుపై పోలీసులు జరిపిన లాటీచార్జీపై న్యాయ విచారణ జరపాలని నినాదాలు చేశారు. ఏప్రిల్ 14న బి. జె. పి. కార్యకర్తలపై జరిగిన లాటీచార్జి జనవరి 26 నాటి లాటీచార్జిని మరపించిందని పలువురు రాజకీయ వాదులు తెలిపారు.

**డాక్టర్ చెన్నారెడ్డికి నూతన పదవి :**

ఇందిరా కాంగ్రెసులో పదవుల నుంచి వైదొలగింపబడినవారు మనసంగొఉంటే, ఏదైనా పదవి ఖాయమని ప్రతిపక్షాలు చేసే టీకలకు మరొక తార్కాణంగా డాక్టర్ ఎం.చెన్నారెడ్డికి నూతన పదవి లభించింది. ఆయనను కేంద్ర ప్రభుత్వం పంజాబ గవర్నరుగా నియమించింది. డాక్టర్ చెన్నారెడ్డి రాజనీతి ధురంధరులు. ఏ పదవిలో ఉన్నా రాణించడమే కాక ఆ పదవికే పేరుతెస్తారు. ఆయనకు గవర్నరు పదవి కొత్తకాదు. ఉత్తరప్రదేశ్ వంటి పెద్ద రాష్ట్రం గవర్నరుగా ఆయన ఇదివరకే తమ పరిపాలనా దక్షతను నిరూపించుకున్నారు.

**కొత్త పార్టీతో నూతన సాహిత్యం:**

తెలుగుదేశం పుణ్యమా అని రాజకీయ పక్షాల వారిలో నూతనోత్సాహం పుట్టుకవచ్చి, నూతన సాహిత్యం వెలువడుతున్నది. అలనాడు శోకంతో వాల్మీకి ముఖం నుండి శ్లోకం వెలువడింది గాని నేడు రాజకీయ నాయకుల ముఖారవిందాల నుంచి, ఉత్సాహోద్రేకాలతో వ్యంగ్య రచనలు, వ్యాయోగాలు, సమస్కారాలు వెలువడుతున్నాయి. ఇందిరా కాంగ్రెస్ నాయకుడు, రాష్ట్ర కార్మిక శాఖా మంత్రి శ్రీ జి. వెంకటస్వామి తెలుగుదేశం కేవలం కమ్మ దేశమని చలోక్తి విసరగా — శ్రీ తారకరాముని అభిమానులు 'తెలుగుదేశం ప్రజల కష్టాల తరింపజేసే కమ్మని దేశ'మని చమత్కరించారు. మయసభలో దుర్యోధనుని వలె శ్రీ ఎన్ టి ఆర్ రాజకీయాలలో ప్రవేశించారని ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకటరాం చలోక్తి విసరగా, 'కృష్ణుడు పారిజాత వృక్షం తేవడానికి ఐరావత రథంలో ప్రవేశించినట్లు శ్రీ ఎన్ టి ఆర్. రాజకీయాలలో ప్రవేశించా'రని ఆయన అభిమానులు సమాధానమిచ్చారు. రంగులు మార్చేవారికి రంగులు రుద్దే పార్టీ తెలుగు దేశమని రాష్ట్ర చిన్నతరహా నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ రవీంద్రనాయక్ విమర్శించగా, 'రంగుమాసిన తెలుగు సంస్కృతికి, కీర్తి ప్రతిష్ఠలకు కొత్త రంగులు దిద్ది మిరుమిట్లు గొలిపే పార్టీ తెలుగుదేశ'మని దాని అభిమానులు తిప్పికొట్టారు. యీ నెల 11వ తేదీన తెలుగుదేశం తొలి మహాసభకు నిజాం కళాశాల ఆవరణలో వేసిన పెద్ద షామియానా భారీ వర్షం వల్ల తడిసిపోయినప్పుడు, సభా నిర్వాహకులకు ప్రభుత్వంతో పాటు ప్రకృతి కూడా సహకరించడం లేదని ఒకరు వ్యాఖ్యానింపగా 'ప్రకృతి వేసవిలో చల్లటి జల్లులు కురిపించి కొత్త పార్టీకి స్వాగతం పలికింద'ని శ్రీ ఎన్ టి. ఆర్. అభిమానులు చమత్కరించారు. ఇలా రాజకీయాలలో నూతన సాహిత్యం మొగ్గ తొడుగుతున్నందుకు సాహిత్యాభిమానులు సంతోషిస్తున్నారు.

**ఉపశ్రుతి :**

ఏం సార్, తెలుగుదేశం పార్టీని ఇందిరా కాంగ్రెస్ వారు వెక్కిరిస్తున్నారే ! అది నిలదొక్కుకుంటుందంటారా ?— అని ప్రశ్నించారు నన్నొక ఎన్ టి. ఆర్ ఫ్యాన్ దీనంగా. 'అబ్బాయీ, రాజకీయాల రహస్యమే అది. రాజకీయాలే ఎందుకు ? అన్ని రంగాల రహస్యమూ ఇదే. ఇగ్నోర్, ఇన్సల్ట్, రికగ్నైజ్—అనేది సూత్రం. మొదట ఉపేక్షిస్తారు ఇది మొదటి ఘట్టం. పిదప వెక్కిరిస్తారు. తిడతారు, కొడతారు, అవమానిస్తారు ఇది రెండవ ఘట్టం తర్వాతగుర్తిస్తారు. ఇది మూడవఘట్టం. సినిమావాళ్లేం చేస్తారులే అని ఉపేక్షించిన నెలలోనే తిట్లు, నిరసనలు జరుగుతున్నాయి అంటే—ఇక గుర్తింపుచేరువ అన్నమాట' అన్నారు మా సంభాషణ వింటున్న ఒక తెలుగుదేశం అభిమాని.

---

**అల్పం**

గోరంత దీపం
కొండంత తృప్తి (వెలుగు)
రవ్వంత పేరాశ
ఆకాశమంత అసంతృప్తి.

— మాధవరపు కృష్ణ

---

# బాధారహిత ప్రకృతిసిద్ధమైన ఆరోగ్యము మీదే!

## స్త్రీల బాధలు ప్రత్యేకమైనవి

**లోధ్ర**

75 సంవత్సరములకు పైగా
సుఖజీవనమునకు
లోధ్ర టానిక్‌ను
వాడిన స్త్రీలు ఎందరో






ఉచిత వైద్య సలహాకు
ఈ క్రింద పేర్కొనబడిన విలాసమునకు
ఈ కూపన్‌ను పూర్తిచేసి మీ జాబుతో పంపండి.

పేరు ______________________

విలాసము ______________________

______________ PIN ______________

**కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్** రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్ విజయవాడ — సికిందరాబాద్

---

దుందుభినామ సంవత్సరంలో
విజయ దుందుభి మ్రోగిస్తూ
**శ్రీ శ్రీనివాసా వారి నవలాతరంగాలు**
**10-5-1982న**
సాహిత్య విహారానికి వస్తున్నాయి!

| | | |
|---|---|---|
| మాదిరెడ్డి సులోచన | చిగురాకులలో చిలకమ్మ | రూ. 15-00 |
| కె. రామలక్ష్మి | కొత్త పొద్దు | రూ. 13-00 |
| గిరిజశ్రీ భగవాన్ | ప్రేమ సందేశం | రూ. 13-00 |
| వాసిరెడ్డి సీతాదేవి | శాకుంతలం | రూ. 11-00 |
| ఆర్. సంధ్యాదేవి | రత్న సంకెళ్ళు | రూ. 11-00 |
| ఆర్. సంధ్యాదేవి | ప్రియవాదిక | రూ. 9-00 |

ప్రతి నవలా ఆకర్షణీయమైన గెటప్‌తో చక్కని కథా కథనాలతో ప్రతి ఒక్కర్నీ ఆకట్టుకునేలా తయారవుతున్నాయి.

పై పుస్తకాలకి పూర్తి సొమ్ము రూ. 72/- లు ముందుగా M.O. పంపినవారికి పూర్తి సెట్టు రిజిస్టర్ పోస్ట్‌లో పంపబడును.

ఏజెంట్లకి, బుక్ సెల్లర్స్‌కి ఆకర్షణీయమైన కమీషన్.

అందమైన 8 పేజీల ఉచిత బ్రోచెర్‌కి,
ఇతర వివరాలకి:

**శ్రీ శ్రీనివాసా పబ్లికేషన్స్**
ఎటి అగ్రహారం,
గుంటూరు-522004

---

తెలుగులో అపూర్వమైన
అంబడిపూడి పుస్తకాలు
అన్నువాదాలను చదవండి
విజయవంతంగా జీవించండి

## మోహినీ శక్తి

చేతబడులు, పెట్టుడు మందులు, వశీకరణం, ఆకర్షణ శక్తి, క్షుద్రశక్తి, దెయ్యాలు, భూతాల రహస్యాలు రూ. 10/-

తాంత్రిక శక్తి - రూ. 10/-
...యోగం - రూ. 10/-

ఇతరుల ప్రయోగాన్ని ఎదుర్కోడానికి అద్భుతశక్తులు సాధించడం, మనసిరి తనంతకుండా ముసివేయబడిన అనుసరించిన రహస్యాలు!

... ప్రయోగం రూ. 10/-

హిప్నాటిజం సాధన - సమ్మోహన శక్తి ప్రయోగ రహస్యాలు - స్వంతంగా ప్రయోగించే విధానం

సంకల్పబలం - 1వ భాగం. 5/- రూ
సంకల్పబలం - 2వ భాగం. 10/- రూ
మీరూ మీ శక్తి — 10/- రూ

మానసిక శక్తుల సాధన, అద్భుత చిత్రవిచిత్ర ప్రయోగాలు

పిరమిడ్ శక్తి - రూ. 10/-
గుండీ, బల్ల, ఇళ్ళు, పిరమిడ్ ఆకారంలో చేసుకొని హాయిగా, సంతోషంగా వుండే శక్తి రహస్యాలు.

జెన్ విద్య - వెల: 10/- రూ
ఐ చింగ్ - వెల: 10/- రూ

టిబెట్, చైనా మాంత్రిక సాధనలు - రహస్యాలు. రూ 110/- పంపినవారికి పుస్తకాలు రిజిస్టర్డు పోస్టులో పంపుతాము ముందుగా డబ్బు పంపాలి! వి.పి.పి. పద్ధతి లేదు

# అవీ ఇవీ అన్నీ

## ఇండోర్ తెలుగు విజ్ఞాన సమితి ఉగాది వేడుకలు

ఇండోర్ తెలుగు విజ్ఞాన సమితి వారు శ్రీ కె. బి. రామ్మూర్తి అధ్వర్యంలో దుందుభి ఉగాది వేడుకలని జరుపుకున్నారు. శ్రీ పి. విశ్వనాథం కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షులు డా. కె. ఎస్. మూర్తి స్వాగతం చెప్పారు. బి. లక్ష్మి, చిత్ర ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభం అయింది. శ్రీ కె. విజయ గోపాల్ పంచాంగ శ్రవణం, బి. లక్ష్మి, జయలు నృత్య ప్రదర్శన చేశారు. ఏకపాత్రాభినయ ప్రదర్శనలు మొదలైనవి ఆసక్తికరంగా శ్రీ సి. బి రామచంద్ర నిర్వహణలో ప్రేక్షకులని అలరించాయి.

## బెంగుళూరులో ఉగాది వేడుకలు

బెంగుళూరు తెలుగు సాంస్కృతిక సమితి వారు దుందుభి ఉగాది సందర్భంగా శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ ముఖ్య అతిథిగా విచ్చేశారు. లలిత సంగీతం, వేణుగానం, తెలుగు జానపదాల పై శ్రీ ఘట్టమరాజు ప్రసంగం, 'తెనుగు తోట' లిఖిత పత్రిక ఆవిష్కరణ మొదలైన కార్యక్రమాలు నిర్వహించారు. చివరిదిగా శ్రీ గొల్లపూడి రచించిన 'దొంగలొస్తున్నారు స్వాగతం చెప్పండి' నాటిక ప్రదర్శించారు. నగరంలోని పెక్కు తెలుగు సంస్థ వారు ఈ కార్యక్రమాలకి హాజరైనారు.

## వీర్ సావర్కార్ జ్ఞాపకాలు

స్వాతంత్ర్య వీర్‌సావర్కార్ రాష్ట్రీయ స్మారక్, బొంబాయి వారు వీర్‌సావర్కార్‌కి సంబంధించిన విషయాలని సేకరించి ప్రచురించాలని నిర్ణయించారు. కాబట్టి సావర్కార్ సన్నిహితులు, పరిచయం ఉన్నవారు ఆయనతో తమ అనుభవాలని, ఆయన స్మృతి చిహ్నాలని గౌరవ కార్యదర్శి, స్వాతంత్ర్య వీర్ సావర్కార్, రాష్ట్రీయ స్మారక్, 252 సావర్కార్ మార్గ్ బొంబాయి—400028 అన్న చిరునామాకి పంపగోరుతున్నారు.

## వసంతోదయం

కవితా సంకలనం (బమ్మెర పోతన పంచ శతి జయంత్యుత్సవ కవితాంజలి) 24 పేజీలు. వెల మూడు రూపాయలు. ప్రతులకు: సాహితీసుధ (రిజిస్టర్డ్), డోర్ నెం. 9—139, నాయుడు గూడెం రోడ్డు, పెదపాడు—534 437.





# ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

## విభిన్న సిద్ధాంతాలు

ఆత్మ అనేది ఒక్కటే అనీ, ఉపాధి భేదాలను బట్టి జీవాత్మ, పరమాత్మ భేదాలు కలిగాయనీ, పరబ్రహ్మాత్మకమైనది పరమాత్మ అని, మానవులు మున్నగు జీవులలో ఉండేది జీవాత్మ అనీ అద్వైత వాదుల సిద్ధాంతం. ద్వైతవాదులు దీనికి ఒప్పుకోరు. రెండు ఆత్మలూ ఒక్కటే అయితే దేవుడికీ, మనకూ భేదం లేకుండా పోతుందనీ, మనమే దేవుళ్ళమని మనం భావించడం తగదనీ, రెండు ఆత్మలూ భిన్నాలే అని ద్వైతుల సిద్ధాంతం. ఒకసారి ఇద్దరు ద్వైతాద్వైత మతస్థుల మధ్య తీవ్రంగా వాదోపవాదాలు జరిగాయి. వేదాలనుండీ, ఉపనిషత్తులనుండీ అద్వైతి ఉదాహరణలు చూపినా ద్వైతవాది వాటికి అర్థాంతరాలు చెప్పసాగాడు. వాదం తెగలేదు.

అప్పుడా మార్గంగా ఒక రజకుడు వెళ్ళిపోతూ వుండగా ద్వైతవాది వాడిని పిలిచి "నీవు దేవుడివేనా?" అని ప్రశ్నించాడు. వాడు "అదేమిటి బాబూ! అలా అడుగుతున్నారు నేను నేనేగాని మరొకణ్ణి ఎలాగౌతాను? నేను నేనే" అని చెప్పి వెళ్ళిపోయాడు. అప్పుడు ద్వైత మతస్థుడు తన ప్రతివాదినిచూచి "మీరు ఆ రజకుని మాటలు విన్నారు కదా! వాడేమిటంటున్నాడు? "నేను నేనే కాని మరొకణ్ణి ఎలాగౌతాను?" అని అన్నాడు కదా! దీని బట్టి పరమాత్మ, జీవాత్మ వేరువేరని తెలియడం లేదా?" అని అన్నాడు. అప్పుడు అద్వైతి మీరు పొరపాటు పడుతున్నారు. నేను నేనే అంటే ఏమిటి? ఒక నేనుకు పరమాత్మ అర్థం. మరొక "నేను"కు జీవాత్మ అర్థం. "పరమాత్మయే జీవాత్మ- ఆ రెండింటి భేదం లేదు - అనే అంశాన్నే వాడు తెలియజేశాడు" అన్నాడు.

ఈ విషయాన్ని భగవాన్ సత్య సాయి బాబాగారు తమ చిన్న కథగా చెప్పారు. ప్రతిమతస్థులూ వారి వారి సిద్ధాంతాలననుసరించి ఉపనిషదాదులకు అర్థం చెప్తారు. ఏ సిద్ధాంతమైనా మానవుడు ముక్తిని పొందడానికి మార్గాన్ని చూపేదే! మార్గాలు వేరుగా వున్నా గమ్యస్థానం ఒక్కటే! అసిక బుద్ధి కలవారు ఈ విషయాన్ని గ్రహించాలి, వాదోపవాదాలతో కాలయాపన చెయ్యడం, కలహాలు పెట్టుకోవడం సముచితం కాదు. ఒక మతంవారు మరొకమతం సిద్ధాంతాలను గర్హించకూడదు. ప్రధానమైన లక్ష్యమునందే తన మనస్సును కేంద్రీకరించి, దానికి తనకు అనుకూలమైన సులభ పద్ధతిని అనుసరించాలి. భక్తి మార్గం సర్వజన శుభమైనదని అనుభవజ్ఞుల అభిప్రాయం.








Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

